REGD. NO. M. 4793

15th OCTOBER 1947

# గృహలక్ష్మి



## దసరా సంచిక

VOL. 16

GRIHLAKSHMI

No. 10

PRICE AS. 6.

GRIHALAKSHMI

# గృహలక్ష్మి.

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక


సంపాదకుఁడు :

డాక్టరు కే. యన్. కేసరి



సంపుటము ౧౬.]  అక్టోబరు 1947  [సంచిక ౧౦




## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.




జయజయ గృహలక్ష్మీ సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

---

# దసరా

దసరా ఉత్సవాలు ఆంధ్రదేశంలో ముఖ్యమైన పండుగలలోకెల్లా ముఖ్యమైనవి. ఆదసరా పదిరోజులలోనూ, దుర్గాష్టమి, మహర్నవమి, విజయదశమి—ఈ మూడున్నూ మరీ ముఖ్యమైనవి.

ఈ దసరారోజులలోనే-మహర్నవమివరకు దేవీనవరాత్రాలని హిందువులు-దేవీపూజలు చేస్తారు. విజయనగరం సార్వభౌములు-ఈ దసరా కడపటిరోజైన విజయదశమినాడు కొల్వుదీరి ఆ సంవత్సరం ఆయవ్యయముల నిర్ణయించడం, దండయాత్రలకు పన్నాగాలుపన్నడం చేశేవారట. ఈ పదిరోజులలో పూర్వరాజులు తమ రాష్ట్రములోని వీరయువకుల సాముగరిడీల నేర్పునైపుణ్యాలను పరికించి బహుమానాలిచ్చేవారు. కవి గాయక, వైణిక, శిల్పకళాశాస్త్ర వేత్తలకు దర్శనమిచ్చి వారి విద్వత్తు పరిశీలించి సమ్మానించేవారట. ఈ దసరారోజులలోనే-ఆడుపడుచులు బొమ్మలకొలువులు తీర్చి, ఆట, పాట, పద్దెం, పేరంటాలు, పిండివంటకాలతో వినోదిస్తారు. ఈరోజులలోనే-కొత్త అల్లుండ్లు అత్తవారింటమన్ననలపొందుతారు. విజయదశమిరోజున ఊరూరగల దేవుళ్లు, దేవతలు-అలంకరించుకొని పార్వేటకు బయలుదేరుతారు. నిరంతరం కార్యనిమగ్నులైన వర్తకులు సమేతూ

ఆరోజున పాలపిట్టను దర్శించి పావనుల మవుదామని గుమలుకట్టి వెతుకుతారు. ఆనాడు గ్రామాధికార్లు పార్వేటవేంచేపు వద్ద కూర్చుండి, ఆ దేవుళ్ల పేరట-గ్రామపౌరులకు కుల, మత, వర్ణ, వివక్షతలు పాటించకుండా-శుభాశీస్సులతో చీట్లువ్రాసి యింటింటికి అంద జేస్తారు. పూర్వకాలంలో ప్రాథమిక పాఠశాలల విద్యార్థులను వెంటగొని-ఉపాధ్యాయులు వారిచే దసరాపద్యాలు, పాటలు చదివిస్తూ-ఇంటింటికివెళ్లి బిడ్డల పోషకులవల్ల విరాళముల పొందేవారు. పిల్లలకు పప్పుబెల్లాలు పెట్టించేవారు. ఈ విధంగా ఈ దసరా ఉత్సవాలు ఆంధ్రదేశంలో అశేషజనమున్నూ-బహుముఖాల నడిపించి, ఆనందించే జాతీయోత్సవాలు.

దేవీనవరాత్రాలలో ఉపాసింపబడే దేవిఎవ్వరు? గాయత్రి, శ్రీ, దుర్గ, కాళి, సరస్వతి, యోగనిద్ర, మాయ, రాధిక-ఇత్యాది బహునామకల్పితం. అయితే అన్నిటా ఉద్దేశింపబడిన దొక్కటే. ఈ సకలచరాచర ప్రపంచమునగల స్థావరజంగమ వస్తుజాలము యొక్క సృష్టిస్థితిలయములకు మూలమైన-ఆదిశక్తి, పరాశక్తి, చిచ్ఛక్తి, మూలశక్తి. ఆశక్తి, లోకంలో ఏదైనా ఉత్పాతము కల్గినప్పుడెల్లా, ఏదేనొక్క భీకర స్వరూపాన ఉద్భవించి ఆలోకకంటకమైన ఆటంకాన్ని తొలగించి, సృష్టిస్థితిలయములు నిరాతంకంగా తిరిగీ సాగడాని కనువు కల్పిస్తుంటుందని-పురాణాలలో ఎన్నో గాథలు పుట్టిఉన్నాయి.

ఆధునిక యుగంలో జరిగినదీ అదే. అక్షరాజ్యాలతుందుడుకు అణిచిందికూడా-పరమాణువులలో నెలకొనియున్న ఆ మహాశక్తియేకదా. (ఆటంబాంబు.)

పైన పేర్కొన్న పురాణగాథలలో నిదిఒకటి: ఒకానొకకాలంలో రాక్షసులిద్దరు-సత్వసంపన్నులు, తపస్సంపన్నులు, వరప్రసాదులునై, లోకకంటకంగా-సకల సృష్టిజాలంలో ఉండే-స్త్రీపురుష వర్గములందలి శుక్లశోణితముల పీల్చివేయగా-అంతా నిర్వీర్యమై పోయింది. అప్పుడు నిఖిలవస్తు సంతానముయొక్క స్థితి రసవిహీనమైనది; లయము నిలిచిపోయినది: పునస్సృష్టి అశక్యమైనది-సంసారచక్రం స్తంభించిపోయింది. నిర్వీర్యమైనజాతికి చావడానికి కూడా శక్తి చచ్చిపోతుంది కాబోలు! నేటి విప్లవ సిద్ధాంతులుకూడా ఆమాటే అంటారు; పసచెడిన సాంఘిక వ్యవస్థ, విప్లవాత్మకమైన ప్రేరణాంశము ఏర్పడి తొలగతోయనిదే-అంత రించదు-అని. సరి; ఆసమయంలో-త్రిమూర్తులునహా సకలవస్తు జాలమున్నూ అగ్నిలో ఆహుతికాగా మహచ్ఛక్తి అందులోనుండి ఉద్భవించి-రాక్షస సంహారంగావించి, వీర్యవంత మైన వస్తుజాలమును తిరిగీ సృష్టించగా-సృష్టిస్థితిలయాత్మకమైన కాలచక్రం యథారీతి సాగిపోజొచ్చినదట.

నేడు ప్రపంచస్థితి సంధిగ్ధావస్తయందున్నది. దుష్టశిక్షణార్ధ మేర్పడ్డ ఆ పరమాణు శక్తిజ్ఞానాన్ని ఇంకా రహస్యంగానే ఉంచుకొని, సంహారకశక్తిగా పెంపొందింతామా, లేక వెల్లడిపరచి నిర్మాణశక్తిగా ఉపయోగించి-ప్రపంచంలో మానవులకు ఏ కొరవలేకుండా చేతామాఅనేది ఇంకా రాజకీయవేత్తలు, రాజనీతిచతురులు నిర్ణయించుకోలేకున్నారు.

నేడు మనదేశస్థితి అట్లాగే ఉన్నది. ఇన్నాళ్లు మనల పట్టి పాలార్చిన పరాధీన తొలగి స్వాతంత్ర్యము సిద్ధించింది. ఈ స్వాతంత్ర్యము నవకాశంగా దీసుకొని-వందల సంవత్సరాలుగా అన్నదమ్ములవలె నున్నవారు గొంతులు కోసుకొంటున్నారు. తిన తిండి, కట్ట గుడ్డ, ఉండనిల్లు, పండమంచం, చేయనుపని, చేసేనేర్పులేక ప్రజలు అల్లాడిపోతున్నారు. ఈ గొంతుకోతలుమాని నిర్మాణాత్మక కార్యక్రమానికిదిగి-ప్రజల గోడుబాపుదామని గాంధీ, నెహ్రూ ప్రభృతులు ఘోషిస్తున్నారు. గత్యంతరమేమి?

ఈ దురవస్థఅంతా-పరాధీనతకాలంలో దేశానికిపట్టుకొన్న నిర్వీర్య లక్షణంగాని వేరు కాదు. నేడా దేవీకటాక్షమున-అదినశించి, దేశీయులకు సృజనశక్తి ఉత్పన్నంకావాలి. దేవి కేవలం సంహారకశక్తి సంపన్నమైన భీకర కాళికామూర్తియేకాదు-అని పైన సూచించే ఉన్నాము. ఆమె కుసుమ కోమలహృదయమైన మాతృమూర్తికూడా! సకలవిద్యా స్వరూపిణీసరస్వతీ; జ్ఞాన విజ్ఞాననిలయమైన గాయత్రి; బాలగోపాల కృష్ణప్రణయినియైన ప్రేమతత్వప్రబోధక రాధిక. అయితే, ఆదేవి ఎక్కడ సాక్షాత్కరించి ఉన్నది?—వెతుకనేల-ఇంటింట గృహలక్ష్మియై వెలిసి ఉన్నది!

అట్టి గృహలక్ష్మి నేడు పైటకొంగు నడుమునబిగించి-నూతన సృష్టికి పూనుకోవాలి. ఇంటింట నిత్యకృత్యమునకవసరమైన, దేశీయభాగ్య భోగ్య ప్రదాయకమైన వస్తుజాలము సృష్టింప బడాలి.

ఒక వస్తు జాలమేకాదు; అది కేవలు స్థూలరూపకం. దానికిమూలమైన సూక్ష్మ తత్వమును సృజించే అవకాశమున్నూ ఆమెదే. అందుకు అవసరమైన-ఓర్పు, నేర్పు అలవరచుకొని, ఆమె తన సంతానమునకు, శ్రద్ధ దీక్ష, శక్తి యుక్తి, మతి ధృతి, ధైర్యం స్థైర్యం, ఆవేశం సాహసం, శీలం ధర్మం-వీటన్నిటిని ఉగ్గుపాలతో నూరిపోయాలి. అట్టి మహత్కార్యానికై ఈ దసరా ఉత్సవాలలో ఆంధ్ర గృహలక్ష్ములు కంకణాలు ధరిస్తారని ఆశిస్తున్నాము.

# జన్మదినాభి వందన పంచరత్నములు

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తిగారు

ఏ పుణ్యాత్ముఁడో యే యుగంబుననో రక్షించెన్ జగంబంచు నెం
తో పాటింతుము వాని జన్మదినముం దోరంపు పర్వంబుగా;
బాపెన్ నేడిట పారతంత్ర్యభరమున్ స్వాతంత్ర్యముం గూర్చె; నీ
"బాపూ" జన్మదినంబు పండుగగు యావద్భారత క్షోణికిన్.

లేవు తుపాకి గుండు లసలే కనరాదు ఫిరంగి సజ్జు; భీ
తావహ వహ్నికీలల నిరంతరముం గురియించు బాంబులున్
లేవు; విమాన సైన్యములు లేవు; కడుంగడు నబ్బురంబు స్వే
చ్ఛావిభవంబు మాకమరె శాంతియుతంబుగ నీదు సత్కృపిన్.

జీతము లేదు; భోజనపుఁ జేవయు లేదు; విశేష గౌరవ
ఖ్యాతులు లేవు; చేతి ధనమంతయు ఖర్చయిపోవ జైలులో
పాతుకపోయి శిక్షలకు పాత్రముగావలె సైనికాళి; నీ
వే తరిఫీ దొసంగితివో, యిట్టె జయింపఁ బరప్రభుత్వమున్.

తరములనుండి యిల్వెడలు ధైర్యముచాలక నిత్యమెండక
న్నరయని జీవనంబె ఘనమంచుఁ దలంచెడు కాంతలెల్లరున్
గురుతర కార్యరంగమునకుం జనుదెంచి స్వతంత్ర తార్జనం
బురుషుల కండగా నిలిచిపోరిరి నీ మహనీయ బోధనన్.

అమితంబౌ పరమాణు శక్తికొఱకై యావత్ప్రపంచాగ్ర దే
శము లొక్కొక్కరు పూని సంతత మిథస్సంహార కార్యక్రమో
ద్యమతన్ దారియుఁ జేన్నబోవిడువ సత్యాహింసలే శాంతికు
త్తమ మార్గంబులటంచుఁ జాటెన మహాత్మా నీకు దీర్ఘాయువౌ.

# బాపూజీ పండుగ

భరతఖండము రాజ్యభక్తిని పొడక

శ్రీరామ రాజ్యమై వఱలుగాత!

సర్వసర్వంసహా స్వప్రజాభ్యుదయమై

స్వారాజ్య సౌభాగ్య మరయుగాత!

అన్యోన్య మైత్రిగా హైందవులేకమై

మత దురాచారముల్ మానుగాత!

మాల మాదిగలను పూలమాలగనెంచి

కుల జాతి భేదముల్ కూలుగాత!

మధ్యపానము లికనైన మానుగాత!

పౌరకేతువు వినతుల బడయుగాత!

కూడు గుడ్డల కొదువ లేకుండుగాత!

బోసి నవ్వుల బాపూజీ బ్రోచుగాత!

నిడదవోలు పార్వతీశ్వరరావు.

# జాతీయోత్సవములు వాని ప్రాముఖ్యత

శ్రీమతి బోడపాటి అలివేలమ్మగారు

ఏ దేశమునందైనను, దేశమునకు, జాతికి, సంఘమునకు మహోన్నతాదర్శములను, మహోన్నతమైన స్థితిని కలుగజేయుటకై అవతరించి తమ జీవితములను త్యాగముచేసిన త్యాగపురుషులయొక్క జ్ఞాపకార్థమునూ, తద్వారా వర్తమాన కాలమునందలి జాతియందు ఉత్తమమైన చైతన్యమును గలుగచేయుటకును జాతీయోత్సవములు తరుచుగా ఏర్పాటు చేయబడుచుండును. మన దేశములో, అట్టి జాతీయవీరులను సంవత్సరమున కొకమారు, వారి ఆదర్శములను మన జీవితమునందనుబంధించి ధన్యుల మగుటకుగాను, మనము పూజించుట ఆచారమై యున్నది.

ఈజాతీయోత్సవములను మన పెద్దలు చాలదృష్టితోఁ నేర్పరచిరి. పూర్వగాథలు, చరిత్రలు, ఆనాటి సాంఘిక, రాజకీయ పరిస్థితులు విద్యావంతులకే కాక పామరులకు సైతము సుబోధకముగా వీనిలో మిళితమై యున్నవి. వీనిని మతవిషయికములుగాను, సాంఘిక రాజకీయములుగాను ఇంకను అనేక విధములుగాను మనవారు విభాగించియున్నారు. మతవిషయములో చేరినవి శ్రీరామనవమి, వినాయకచతుర్థి, రథసప్తమి, సుబ్బారాయుడుషష్టి, దుర్గాష్టమి, విజయదశమి, ముక్కోటి ఏకాదశి, క్షీరాబ్ధిద్వాదశి, దీపావళి, శ్రావణపూర్ణిమ మొదలగునవి. బుద్ధజయంతి, కృష్ణాష్టమి, శంకరజయంతి మొదలగునవి రాజకీయములు. ఈ పర్వములకు ప్రాముఖ్యతను పెద్దలు ఈ క్రింది ఆదర్శములతో నిచ్చిరి.

## శ్రీరామనవమి :—

శ్రీరామచంద్రుడు ఏకపత్నీ వ్రతమును, ఆదర్శకమైన జీవితమును, మంచి ఆచరణచే పొందదగిన దేవత్వమును, తన ప్రవర్తనచే నిరూపించెను. శ్రీరాముని అడవికి పొమ్మనినపుడు, ఆతడు భరతునిచంపి రాజ్యము తీసుకొనవచ్చును. ప్రజలు అతని పక్షమే. కాని ఆతడట్లు చేయలేదు. సాంఘికముగాగాని, రాజకీయముగాగాని క్లిష్టమైన పరిస్థితులు చుట్టబెట్టినపుడు తన స్వార్థమును పరిత్యజించుటద్వారా మానవుడు వానిని చక్కజేయవచ్చును అను ఆదర్శమును శ్రీరాముడు చాటెను. అతడు ప్రజల కొరకై తన ప్రాణమగు సీతను అడవికి పంపెను. అతడు జాతీయ వీరుడు. ఆతని నారాధించుటయే శ్రీరామనవమి.

## గణపతి చతుర్థి :—

దేవతలకు, రాక్షసులకూ నాయకత్వమునకై పోరాటము వచ్చినప్పుడు పసిబాలుడగు వినాయకుడు ఎలుకను వాహనముగా చేసుకొని రాక్షసులను చంపెను. మనకు ఇప్పుడు ఎలుకను వాహనముగాఁజేసికొను

టేమని నవ్వా, నిరసనా. నాయకత్వమును, చిన్నవారైననూ, పెద్దవారయిననూ వయస్సు పాటింపక సమర్థుల కియ్యవలెననియూ, నాయకులు అల్పమూ, క్షుద్రమూ అనుకొనక ఎలుకవంటి దానినికూడ అవసరమువచ్చిన దేశమును ఉద్ధరించుటకై స్వీకరించవలెననియూ ఈ వినాయకచవితి చాటుచున్నది. ఆతని ఆరాధన మనకు ఎంతయూ అవశ్యముకదా! నేడు దేశమునందు ఈ విధమైన ఉద్దేశములనూ, భావములనే మనము కోరు చున్నాము.

దుర్గాష్టమి :—

సాధారణముగా ఏదైన నొక కార్యమునకు ప్రేరేపించునది స్త్రీ. చేయువాడు పురుషుడు. కాని ఒక వేళ పురుషుడు భోగపరాయణుడై తన కర్తవ్యమును ఉపేక్షించినపుడు స్త్రీ శక్తి స్వరూపిణియై విజృంభించి తన దేశమును, సంఘమునూ ఉద్ధరించవలెనని బోధించుచున్నది. మహేశ్వరుడు మహిషాసురుని శిక్షింపక ఉపేక్షించుటచే ఆ పని పార్వతియే చేసినది. దీపావళికూడ ఇటువంటిదే. స్త్రీ అయిన సత్య నరకాసురుని చంపెను. వీనిని బట్టి స్త్రీలు పురుషునకు ఎంత మాత్రమునూ వెనుకబడియుండరను విషయము తెలియుచున్నది. ఇది చరిత్రాత్మకమైన విషయము.

కృష్ణాష్టమి :—

నిర్వీర్యమైన సంఘములో జాతీయచైతన్యతను కలిగించుట కృష్ణాష్టమి రాజకీయ ప్రాముఖ్యత. కృష్ణాష్టమి మహాపురుషుడుఅగు కృష్ణుని జన్మదినోత్సవము. సుప్రసిద్ధ వంశస్తులగు పురుషులు ఇతర కులములవారిని గర్వపూరితులై నిరసించినప్పుడు వారిని భంగపరచుటకు తక్కువ కులములలోని వారే బయలుదేరవలెనను నీతిని కృష్ణజీవితము బోధించుచున్నది. అందుకొరకే కృష్ణుడు యాదవుడయ్యెను.

బుద్ధ జయంతి :—

బుద్ధుడు లోకమునందలి హింసను చూడలేక సన్యాసియై లోకమును ఉద్ధరించుటకు ఒక మతమును కనిపెట్టెను. బౌద్ధమత ప్రాబల్యమును మన మందరమునూ ఎరుగుదుము. ఆతని జ్ఞాపకార్థము బుద్ధ జయంతి.

కాబట్టి వీరారాధనము యొక్క మారురూపములే ఈ జాతీయోత్సవములు. ఇవి మతధర్మములను, ఆరోగ్య విధానములనూ సమ్మిళిత మొనరించి, ఆధ్యాత్మికాదర్శములనూ, ఐహిక సుఖములను పెంపొందింప జేయుటకై ఏర్పాటు చేయబడినవి. కొన్ని ఉత్సవములయందు కళలుకూడ ఉద్ధరింపబడుచున్నవి. దసరా పదిరోజులూ, కొన్నిచోట్ల పెద్దపండుగ మూడురోజులూకూడ బొమ్మలు పెట్టుకొనుట ఆచారమై యున్నది. ఈ విధముగా ఏర్పరచకపోయినచో శిల్పకళపోషణ ఎట్లు జరుగును? కళను పోషింపవలెనను ఆదర్శముతో బొమ్మలు కొనువారు బహుకొద్ది. సంక్రాంతి ముందర నెలగంటుపెట్టి నెలరోజులు ప్రొద్దుటయందు, సాయంత్రమునందూ, రకరకముల రంగవల్లికలు తీర్చుట ఆచారమైయున్నది.

కొన్ని కొన్ని పర్వములు ఆరోగ్య నియమములకొరకు ఏర్పాటు చేయబడినవి. ఈ నాడు మన దేశము దుర్భర దారిద్ర్యమునకు ఆలవాలమైనదిగాని, ఆ నాడు సస్యశ్యామల భరితమై యొప్పుచుండెడిది. ధన

సమృద్ధి కలవారు, ఆరోగ్య నియమములను ఉల్లంఘింతురు. అట్టివారు కొన్ని దినములు ఉపవసించుట వలన, ఒకపూట భోజనములవలన రోగాముల పాలబడకుందురు. అట్టివి భీష్మ ఏకాదశి, శివరాత్రి, కార్తీక సోమవారములూ.

కొన్ని పర్వములు విశ్రాంతికి మాత్రమే. పంటలు, కోతలు అయిన పిమ్మట, కర్షకజనము విశ్రాంతి తీసుకొని ఆహ్లాదకరముగా రోజులను గడపుటకు వాంఛింతురు. అట్టి రోజులలో వచ్చునది సంక్రాంతి. దీని ఉద్దేశము ఆనందముగా విశ్రాంతి తీసుకొనుటయే. సంవత్సరాది పండుగకూడ ఇటువంటిదే. ధాన్యమూ, క్రొత్త చింతపండూ మొదలగునవి ఆ రోజునకు వచ్చుటచే పండుగ చేసుకొందురు. ఉగాదినాడు తిను వేప పువ్వూ, బెల్లమూ, మామిడికాయ కలిసిన పచ్చడి ఆరోగ్యకరము. వేప విషక్రిములను చంపును. బెల్లము ఎముకలను గట్టిపరచును. మామిడి విరోచనకారి.

ఈ విధముగా ఇవి ఆరోగ్యాభివృద్ధి సూచకములై, ఉన్నతా దర్శములను బోధించునవై ఆహ్లాదానందములను ఇచ్చునవై యున్నవి. కాని నేడు మనము వానిని గుడ్డిగా, వాటి ప్రాముఖ్యతలోని లోతు పాతులు తెలియకుండా గుడ్డిగా ఆచరించుచున్నాము. వానిలోని ఆదర్శములనే మన మెరుగము. జాతీయవీరుల ఆరాధన దేశ ప్రజల కర్తవ్యముకదా! నేడు గాంధీ వర్ధంతి, తిలక్ వర్ధంతి, నెహ్రూ జయంతి, స్వతంత్ర దినోత్సవం, క్విట్ ఆసియా దినోత్సవం, నేతాజీ జన్మదినం మొదలగునవి చేయుటకు మనము ఎంత ఉత్సాహము పడుచున్నాము? అట్లే జాతీయ వీరులగు వారిని స్మరించుట ఉద్రేక పూరితమూ, ఉత్సాహ పూరితముగాదా? కాని ఏదైన ఉత్సవము చేయునపుడు దాని అర్థము గ్రహించి చేయుటచే ఆ కార్యమునకు విలువ ఎక్కువగును. కాని నేడు పిండివంటలు చేసుకొనుటా, తలంటి జేసుకొనుట ఇంత కరువు రోజులలోనూ మిగిలినది. పిండివంటలుకాదు ముఖ్యము. ఆ ఆదర్శములను మనలో జీర్ణింప జేసుకొన వలెను. ప్రాచ్యపాశ్చాత్యదేశముల కలయికలో ఉద్భవించిన వెలుగులో మనము ఇప్పుడు నేర్చుకొనవలసి నది పరిశీలనాయుతమైన, నిష్పాక్షికమైన సరియగు ఆలోచన. మనపాత ఆచారములను కొట్టి పారవేయక అందులోని మంచిని గ్రహించవలెను.



## శ్రీ ఓరుగంటి వెంకటసుబ్బయ్యగారు కీ॥ శే॥ వారి ధర్మపత్ని

## మహాలక్ష్మమ్మగారు వారి సంతానము



నిలువబడి యున్నవారి కుమారు లిద్దరిలో గాంధీ టోపి ధరించిన వాడు కీ॥ శే॥ వెంకటేశ్వర్లు॥ పద్దగ్రనవేత్త. 1932 సత్యాగ్రహమున 1 సం॥ కఠిన ఖైదనుభవించాడు. ఆటోపీ లేనివాడు రామచంద్రయ్య - 1930 ఉప్పుసత్యాగ్రహమున ఖైదు అనుభవించెను. 1934 లో కాకినాడ బాంబు కేసులో శిక్షబడినాడు గాని హైకోర్టు అపీలులో విడుదలైనాడు. నేడు ఎం.ఏ.,పి.హెచ్.డి. డిగ్రీపొంది ఆంధ్రవిశ్వవిద్యాలయమున హిస్టరీ లెక్చరరుగా ఉన్నాడు. వారి ఇరుపార్శ్వముల నిలిచియున్నవారి కుమార్తెలు చి॥ సౌ॥ మైత్రేయి, అనసూయలు - 1931 సం॥ విదేశవస్త్రపుల దుకాణములవద్ద పికెటింగు సల్పియుండిరి. వీరుగాక - వీరికి మరి ఇద్దరు కుమారులుగలరు. ఒకరు వెంకటగిరి రాజాగారి కళాశాలలో చారిత్రకాచార్యులు. మరొకరు న్యాయవాదులు. వృద్ధాప్యమున భార్యావియోగము పుత్రవియోగముకల్గియు దేశసేవవీడని కర్మయోగి శ్రీ వెంకటసుబ్బయ్యగారు.



# మేలుకొలుపు

రచన : శ్రీమతి తిమ్మరాజు హైమవతిగారు



**మేలుకొనుమా తెలుగుతల్లీ- మేలుకొనవే కన్నతల్లీ**

నవ్యభానుని స్వర్ణకాంతులు
దివ్యలోకము లన్ని వెలిగెను
దిక్కు దిక్కున కాంతి మెరసెను
శాంతికన్యక నాట్యమాడగ ॥ మే ॥

జ్ఞాన తేజము దీప్తి జెందగ
శాంతివెలుగులు దిశలనిండగ
జయము జయమని భారతాంబకు
విజయగీతిక లాలపింపగ ॥ మే ॥

నవ్యవికసిత నవనవోజ్వల
దివ్యపరిమళ ప్రేమసుమమై
జ్ఞానజ్యోతులు వెలుగుచుండగ
నవ్యభారతి కన్నువిప్పెను ॥ మే ॥

దేవళమ్ముల పైడిగంటలు
జయ జయ ధ్వానములు మ్రోగగ
త్యాగరాజుని మధురగీతిలో
నవ భారతికి నివాళు లివ్వ ॥ మే ॥

# నవరాత్రమహిమ

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు (కవితాసమితి)

౧

దేవీనవరాత్రవ్రతము వ్రతాలన్నిటియందూ చాలాగొప్పది. ఆ వ్రతాన్ని ఆచరించినవారికి వైభవమూ, మంగళమూ, ఆయుర్దాయమూ, విద్యా, కీర్తి, శక్తి, ధృతి, పరమూ లభిస్తాయి. రాజ్యభ్రష్టులూ, విద్యకావలసినవారు ఈ వ్రతాన్ని శ్రద్ధాభక్తులతో ఆచరిస్తే వారికి రాజ్యమూ, సకల విద్యలూ నిమిషములో లభిస్తాయి. సంతానములేని వారూ, రిక్తులూ, రోగులూ, దుర్జనులూ, దుర్గుణులూ, కష్టాత్ములూ, భ్రష్టులూ, వంద్యలూ, విధవలూ, దరిద్రపుస్త్రీలూ మున్నగువారు పూర్వజన్మలో ఈ వ్రతాలు చేసివుండలేదని వూహించు. నవరాత్రులలో దేవిని చందనంలో ముంచిన బిల్వాదళాలతో పూజించినవాడు రాజవుతాడు. ఆ మహాదేవిని హరిహర హిరణ్యాగర్భులూ, అష్టదిక్పాలురూ, దేవతలూ, మహా మునీశ్వరులూ నిరంతరమూ పూజిస్తారంటే ఇతరుల మాట చెప్పడానికేమున్నదీ? ఆమె దయవల్ల త్రిమూర్తులూ, సృష్టిస్థితిలయాలు చేస్తూవుంటారు. మహాపాపాలు చేసినవారి నవరాత్రవ్రతాన్ని చేసినట్టయితే వారిపాపాలు తుప్పురాలినట్లు వేంటనే రాలిపోతాయి.



కోసల దేశంలో పూర్వం సుశీలుడనే వైశ్యుడు ఒకడు ఉండేవాడు. అతనికి "ధనధాన్యాలులేవు సరిగదా సంవత్సరానికిద్దరు పిల్లలా" అన్నట్లు సంతానం హెచ్చు. అతడా సంతానాన్నీ, భార్యనీ పోషించలేక దుఃఖపడుతూ వుండేవాడు. సంసార బాధ పడలేక అతడొకబ్రాహ్మణుని సమీపించి నమస్కరించి "మహానుభావా! నేను పరమ దరిద్రదేవతామూర్తిని, నా దగ్గర గుడ్డిగవ్వకూడా లేదు, నా కెందరో పిల్లలున్నారు, వారు, నాభార్య ఆకలిబాధలతో మలమల మాడి పోతున్నారు, వారి ఆకలిబాధను నేను చూడలేకపోతున్నాను, వాళ్లకు తిన్నగా అన్నమయినా పెట్టలేనప్పుడు వారి వివాహాది

కార్యాలింకేమి చెయగలను? పెండ్లీడు వచ్చిన పిల్లలుకూడా ఉన్నారు. వారిని చూచినప్పు డల్లా నాగుండె చెక్కలై పోతూంది. నిర్ధనుడు గడ్డిపరకకైనా పనికిరాడు కదా! అందు వల్ల నాకేమీ తోచడం లేదు. దీనికేమైనా ఉపాయం ఉంటేచెప్పు. విశేషమైన ధనము నా కక్కరలేదు. దినముగడిచిన చాలు" అన్నాడు.

దేవీనవరాత్రమహిమ తెలిసిన ఆబ్రాహ్మణుడు "ఓయీ! నీవింక దుఃఖించకు. శరత్కాలంలో ఆశ్వీయుజ మాస శుక్లపక్ష పాడ్యమి మొదలు దేవీ నవరాత్రములు చేసినవారికి సకల దారిద్ర్యాలూ నశిస్తాయి. ఆరోజుల్లో దేవిని జపతప హోమాలతోనూ, నృత్యగీత వాయిద్యాలతోనూ, అనంతమైన పూజావిధులతోనూ, భోజన భాజనాదు లతోనూ సంతృప్తిపరచిన వారికి సిరిసంపదలూ, జ్ఞానమూ, మోక్షమూ లభిస్తాయి.

పూర్వం శ్రీరామచంద్రమూర్తి దండకారణ్యంలో సుగ్రీవుని సహాయంవల్ల నవరాత్ర వ్రతాన్ని చేశాడు. అందువల్ల సముద్రాన్ని బంధించి, బంధుమిత్ర పుత్ర సహితుడైన రావణాసురుణ్ణీ, కుంభకర్ణునీ సంహరించి, విభీషణుణ్ణి లంకారాజ్యానికి పట్టాభిషిక్తుణ్ణిచేసి సీతతో కూడా అయోధ్యాపురంచేరి, నిర్భయంగా సామ్రాజ్యాన్ని పరిపాలించాడు. కాబట్టి ఈవ్రతం శత్రువుల్ని నాశనంచేస్తుంది. సంపదలూ, సంతానమూ ఇస్తుంది." అనిచెప్పి ఆవైశ్యునికి మాయాబీజ మంత్రాన్ని ఉపదేశించాడు. వైశ్యుడా మంత్రాన్ని శ్రద్ధాభక్తు లతో గ్రహించి, శక్తివంచన లేకుండా తొమ్మిది సంవత్సరాల పాటు వ్రతాచరణం చేసాడు. తొమ్మిదవ సంవత్సరపు నవరాత్రులలో అష్టమినాటి రాత్రి అతనికా దేవదేవి సంపూర్ణ కరుణారస హృదయంతో ప్రత్యక్షమై అనేక వరాలు ప్రదానం చేసింది. అతని కోర్కె లన్నీ ఫలించాయి.

(దేవీ భాగవతం నుండి)



# వేదకాలపునాటి స్త్రీలు





రాజా రంగయ్యప్పారావు బహద్దరు, ఎం.ఎ.,
ఉయ్యూరు కుమారరాజా



## వేదకాలపునాటి స్త్రీలు

వేదకాలములో స్త్రీలు, పురుషులు సమానులుగా పరిగణింపబడుతుండే వారనడానికి చాలా ఆధారాలున్నాయి. సాంఘికమర్యాదల్లో, మతవిషయమైన కర్మకాండలలో స్త్రీలకు ఎంత ప్రాముఖ్యముందో మనకు తెలిసిన విషయమే. అందువల్లే భార్యను అర్ధాంగి అన్నారు. కాని తరువాత కాలములో స్త్రీలకు మర్యాద తగ్గింది. దానితో పాటు సంఘముకూడా వేదకాలపు పటిమను కోల్పోయింది. పురాణకాలములో స్త్రీల కెట్లో, పురుషులకు కూడా అట్లే అన్ని విషయాల్లో హీనదశ సంభవించినది. శతపథ బ్రాహ్మణములో స్త్రీలకు బాగా ప్రాముఖ్యం ఇవ్వబడింది. పిల్లలను పెంచుటలో తల్లికి చాలిన గురువు లేదని చెప్పబడింది. ఇది మనందరికి తెలిసిన విషయమే. ఈరోజుల్లో స్త్రీలకు విద్య తక్కువగుటచేత, బలములేక అనారోగ్యులై యుండుటచేత, పిల్లలను సరిగా పెంచక పోవుటేగాక, పుట్టేవారు చాలా బలహీనంగా పుట్టుతున్నారు. సరిగా పిల్లలకు పాలిచ్చేశక్తికూడా 100కి 50 వద్దలేదు. ధర్మశాస్త్రాల్లో కూడా మంచి స్థానమే ఇవ్వబడింది. మను స్మృతిలో స్త్రీలను గురించి మొదట చాలా మర్యాదగాను, తర్వాత చాలా హీనంగాను చెప్పబడింది. అంటే ధర్మశాస్త్రాలు క్రమ క్రమంగా వృద్ధిపొంది మనువుచేత పొందుపరుపబడినవని తేల్తుంది. అందువల్ల వేదకాలమునాటి ప్రాముఖ్యము కొన్నిచోట్ల, తర్వాపిదూషణ కొన్నిచోట్ల మనుస్మృతిలో ఉండుట తటస్థించింది. మనము స్త్రీప్రాముఖ్యము ధర్మశాస్త్రాలలో ఏవిధంగా ఉందో పరిశీలిస్తే ఆకాలపునాటి మర్యాదలు, సంఘము యొక్క ఉచ్చస్థితి పూర్తిగా అర్ధంఅవుతాయి. మనువు స్త్రీకి ఇంట్లోపాలన పూర్తిగాఇచ్చాడు. అంతేగాకపిల్లలను కని సంతోషము గలిగించు స్త్రీ లక్ష్మీదేవితో సమానురాలని మర్యాదచేశాడు. "స్త్రీ ఏగృహములో విచారముతో ఎల్లప్పుడు బాధపడుతూ ఉంటుందో ఆ ఇల్లువృద్ధికి రానేరదు. స్త్రీలు ఏకుటుంబములో గౌరవింపబడతారో ఆ కుటుంబముమీద భగవంతుడు ప్రేమగలిగిఉంటాడు. స్త్రీలను అమర్యాద చేసేచోట ఎన్ని పూజా పురస్కారములు చేసినను ఏమీలాభములేదు." దీనినిబట్టి మనువు స్త్రీలను ఎంతగౌరవించాడో తెలుస్తుంది. యాజ్ఞవల్క్యమహర్షి 'స్త్రీలు సుగుణసంపన్ను'ని చెప్పాడు; "సోముడు తన ఉత్తమ

గుణములను, గంధర్వరాజు తన మృదుస్వరమును, అగ్నిదేవుడు తన కాంతిని స్త్రీలకు ఇచ్చి" రని యాజ్ఞవల్క్య స్మృతిలో చెప్పబడింది. ఈగౌరవం పురాణకాలములో కూడా మనకు కనబడుతుంది. మహాభారతములో స్త్రీలకు గృహములోనేగాక, సాంఘిక జీవనంలో కూడా చాలా ప్రాముఖ్యం ఇవ్వబడిన సంగతి మన కందరికి తెలిసిందే. కుంతీదేవిని చూస్తే మనకీవిషయము బాగా బోధ పడుతుంది. తన అయిదుగురు కొడుకులతోపాటు ఆమె అన్ని అష్టకష్టములుపడి, వారికి అరణ్యములోగాని, కుగ్రామంలోగాని ఏవిచారము లేకుండా జాగ్రత్తగా చూచింది. పాండవులు అన్నము యాచించి తెచ్చినప్పుడు మిగత నలుగురు కొడుకులకు సగము, భీమునకు సగము ఇచ్చేది. దీనిని బట్టి ఎవరెవరికి ఎంత కావలెనో అంతయిచ్చి వారికి సౌఖ్యము గలుగుజేసింది. అంతేగాక యుద్ధసమయంలోగూడా పాండవులకు కుంతి ఎంతో సహాయము చేసింది. కౌరవులకు కర్ణుడు ముఖ్యమైన సేనాని. అతని పైనే దుర్యోధనుడు పూర్తియైన ఆశపెట్టుకున్నాడు. అందువల్ల కుంతి రహస్యముగావెళ్లి కర్ణునితో అతడు తనకొడుకేనని, కాబట్టి పాండవులకు సహాయంచేయాలని చెప్పింది. కాని కర్ణుడు దానికి లొంగలేదు. అప్పుడు ఎక్కడెక్కడికో అన్నట్టుగా చివరకు అర్జునుని తప్ప మిగతావారిని చంపనని ప్రతిజ్ఞ తీసికొన్నది. దీనివలన అనేకసార్లు కర్ణుకు యుద్ధములో అవకాశము దొరికియు, భీముని చంపక మానివేయవలసివచ్చినది. ఇందుచేతే కర్ణుడు ఓడింపబడ్డాడు. కాబట్టి స్త్రీలు కూడా ఆరోజుల్లో యుద్ధతంత్రములలో పాల్గొనేవారని మనకు తెలుస్తుంది. ఇప్పుడు కూడా విజయలక్ష్మినివలె విదేశాంగ మంత్రుల్ని, రాయబారుల్ని, స్త్రీలను నియమించితే, బహుశా చాలావరకు అంతర్జాతీయసఖ్యము ఏర్పడుతుందేమో! స్త్రీని ఎంతగా మహాభారతంలో పొగిడాడో చూడండి:-

సీ॥ ధర్మార్ధ కామసాధన కుపకరణంబు గృహనీతి విద్యకు గృహము విమల
చారిత్ర శిక్షకాచార్యకం బన్వయ స్థితికి మూలంబు సద్గతికి నూత
గౌరవంబున కేకారణంబున్నత స్థిరగుణ మణుల కాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ చూవె భర్తకు నొందుగావు ప్రియము

ఆ॥ నెట్టిఘట్టములను నెట్టియాపదలను నెట్టిరోగములను చుట్టబడిన
వంతలెల్లబాయు నింతుల బ్రజలను నొనరజాడ గనిన జనులకెంత.

రామాయణములో సీతామహాదేవి ఎంత ఉత్తమమయిన స్త్రీ! ఆమె యెట్టి కళంకములేని మేలిరత్నము. రాముడు పురుషులలో శ్రేష్ఠుడయినను, ఆయనకు ఒకటి రెండు కళంకములున్నాయి గాని సీతకేమియు లేవు. లంకనుండి సీతను తీసుకొనివచ్చిన తరువాత అగ్నిపరీక్ష అయింది. కాని ఎవడో అధముడు దువాక్కు పలకటంచేత, సీతను రాముడు అరణ్యములోకి పంపుట గొప్పలోటు. ఈలోటు రాముని శీలానికి చాలా ప్రమాద కరమయింది. ఎందుకంటే సీతయందు రామునికి ఎట్టి అనుమానము లేకపోయినా, చాకలివాని మాటమీద సీతకు కష్టము కలిగించాడు. వీడిమాట ప్రజావాక్కని కాదు. స్త్రీల

విషయంలో ఇంతవరకు ఉన్నతమయిన విషయాలనే పేర్కొన్న వేదవాక్కులు, ధర్మశాస్త్రాల్లోని విషయాలనే చెప్పాడు. కాని వేదాల్లో, పురాణాల్లో స్త్రీ గర్హణ కూడా చాలా ఉద్ధృతంగా వుంది. వేదాల్లో, మనుస్మృతిలోను స్త్రీ, పురుషునియొక్క హక్కు-భుక్తాలకు సంబంధించిన వస్తువులలో ఒకటనే ఉద్దేశ్యము వచ్చేటట్టుగా చెప్పబడింది. అధర్వ ఋక్కులో భార్య భర్తకు సేవచేయుటకును, సంతానము కనుటకును, భగవంతునిచే ఇవ్వబడిందనిఉంది. మనము తలచుకోవడాని కూడా వీలులేనంత చెడు మాటలు కూడా చెప్పబడి ఉన్నాయి. అధర్వవేదములో "ఆడపిల్లను ఇంకె చ్చటనైన పుట్టించుము. ఇచ్చట మాత్రము పుత్రునే పుట్టించుము" అని ప్రార్థన ఉంది. ఇది ఎందు చేతనంటే పుత్రుడు పుడితేనేగాని తండ్రికి కర్మచేసి సద్గతికి మార్గం చూపడని. కాని అందరు ఇలా ప్రార్థించితే ప్రమాదవశాత్తు భగవంతుడు విని వారివారి కోరికప్రకారము చేసేటట్లయితే, ప్రపంచమంతా మొగపిల్లలే పుడితే, ప్రపంచవృద్ధికే వీలుండదు.

ఇట్లా చెప్పబడ్డా హిందూగృహంలోమాత్రం అప్పుడుఇప్పుడు కూడా స్త్రీకే ప్రాముఖ్యము. పెండ్లప్పుడు చదివే మంత్రాలలో గృహిణిని 'నీ భర్తగృహమునకు వెళ్లి, అక్కడ రాణిగా ఉండుము, నీమామ, అత్త, మరుదులు మొదలగువారిని జాగ్రత్తగా పరిపాలించుము' అని ఉంది. ఇతర దేశములలో ఉన్న ఆ కాలపు మర్యాదలకు మనదేశములో మర్యాదలకు సరిపోల్చి చూచినట్లయితే, మన సంఘ స్త్రీలను బాగా గౌరవించినట్లు తెలుస్తుంది. రోములో భార్య ఒక చైతన్యములోని వస్తువుగానే పరిగణింప బడింది. అంతేగాక కుటుంబపుపెద్దకు స్త్రీల ప్రాణములపైకూడా సంపూర్ణహక్కు ఉండేది. గ్రీసుదేశములో కూడా భార్యకు సేవికావృత్తే ముఖ్యంగా ఉండేది. హిందూదేశంలో మాత్రం స్త్రీ రాణి. రాను రాను మన దుస్థితి వల్ల విపరీతపు మార్పులు వచ్చాయి.

(సశేషము)











## ఆంధ్రరాష్ట్ర రాజకీయ మహాసభలు

ఊరేగింపు: సుందరమైన రథముపైన శ్రీయుతులు M. K. V. రెడ్డి (ఆహ్వాన సంఘాధ్యక్షులు), బౌద్ధవాఙ్మయ దుగ్గిరాల బలరామకృష్ణయ్య (సభాధ్యక్షులు), N. G. రంగాగార్లు.



కుడివైపు: ఆంధ్రకేసరి ఆంధ్రరాష రాజకీయ మహాసభకు హాజరవుట.



ఎడమవైపు: ఇద్దరు వాలంటీర్లు సభాసింహద్వారాముకు ఇరు ప్రక్కల గజారూఢులై స్వాతంత్ర్య పతాకములతో ప్రజకు స్వాగతము నిచ్చుట.





ఇటీవల రాజోలులో జరిగిన తూర్పు గోదావరిజిల్లా

## మహిళా కాంగ్రెసు మహాసభల సందర్భములో

తీయబడిన ఛాయాచిత్రము.

చిత్రంలో :—మహాసభాధ్యక్షురాలు:—శ్రీమతి చుండూరి రత్నమ్మ జమీందారిణి.

,, సభాప్రారంభకురాలు:— ,, వేముగంటి పాపాయమ్మ

,, కళా రాజేశ్వరమ్మ:— ,, కళా రాజేశ్వరమ్మ

,, ఆహ్వానసభాధ్యక్షురాలు ,, (1) బోణం సత్యవతీదేవి.

,, ,, ,, (2) యర్రమిల్లి శేషగిరమ్మ

,, ఆ. సం. కార్యవర్గ ,, (1) యర్రాప్రగడ లక్ష్మీదేవి

,, సభ్యురాండ్రు. ,, (2) అడుమిల్లి వెంకటరమణమ్మ

,, ,, ,, (3) యర్రాప్రగడ సీతారామలక్ష్మి

తదితర ప్రతినిధులు గలరు

# నా చిన్ననాటి ముచ్చట్లు

   కే. యన్. కేసరి

బందరువీధినుండి ఎగ్మూరుయింటికి పోయినపిమ్మట మందులవ్యాపారము ఇంకను వృద్ధిఅయినది. ఇంటికి సమీపమునయుండు పూనమల్లిహైరోడ్డులో యొక పెద్దభవనమును అద్దెకుతీసుకొని అక్కడ ఆఫీసును మందులుచేయు ఫాక్టరీని యుంచితిని. అక్కడనే లోధ్ర ముద్రాలయమునుకూడ స్థాపించితిని. అక్కడనుండియే "గృహలక్ష్మి" ప్రథమ పత్రిక వెలువడినది.

ఇప్పుడు నాకు 43 సం॥ వయసు అయినది. రోగపీడితురాలయిన భార్యయింట యున్నది. ఇంటిలో మరియెవరునులేరు. నాకుకొంత ఆస్తి, ఇల్లు, వ్యాపారము చేకూరినది. సంతానములేదు. సంపాదించిన సొత్తునకు వారసులులేరు. ఈ సమయమున నా బావమరిది కొడుకును దగ్గర తీసితిని. వాడు త్వరలోనే చనిపోయెను. పిల్లవాడు చనిపోయిన వెంటనే మాకు విరక్తిభావము మనసునకుతోచి ఇరువురము తీర్థయాత్రలకు ప్రయాణమైతిమి. ఉత్తర దక్షిణ యాత్రలన్నియు మూడుమాసములలో ముగించుకొని యిల్లు చేరితిమి. నాభార్యజబ్బు దినదినాభివృద్ధి యగుచుండెను.

## "యమ్డెన్" క్రూయిజర్.

మేము బందరువీధిలోనుండగా 22-9-1914 తేదిన మొదటి ప్రపంచయుద్ధములో జర్మన్ క్రూయిజర్ "యమ్డెన్" మద్రాసుపై ఫిరంగిగుండ్లు వదలినది. ఆనాడు నేను రాత్రి 9 గం॥ లకు భోజనానంతరము యింటి వరాండాలో యుంటిని. అకస్మాత్తుగ సముద్రములోనుండి గొప్పవెలుతురును శబ్దమును చూచితిని. ఈ శబ్దము ఏమైనది ఎవరికి తెలియక గుంపులు గుంపులుగా సముద్రతీరమువద్దకు పరువెత్తిరి. నేనును కొంతదూరము వరకుపోయి బర్మాషెల్ ట్యాంకులు భయంకరముగ తగలబడుటచూచి వెనుకకు తిరిగితిని. "యమ్డెన్" మద్రాసుపై అకస్మాత్తుగ ఫిరంగులగాల్చి పరుగెత్తిపోయెను. "యమ్డెన్" పోయినపిమ్మట మనవారు కోటలోనుండి సముద్రముమీాద ఫిరంగీలను పేల్చిరి. ఆనాడు రాత్రి మద్రాసునుండి లక్షలకొలదిజనము దిక్కుతెలియక నలుదిక్కులకు పరుగెత్తిరి. ఇల్లువిడచి పోలేనివారు అక్కడనే వుండిపోయిరి. తెల్లవారగనే పురజనులు సముద్రమువద్దకు వెళ్లి ప్రేలిన ఫిరంగిగుండ్ల వుక్కుముక్కలను యేరుకొనిపోయి "యమ్డెన్" జ్ఞాపకార్థము యింటిలో భద్రపరచుకొనిరి. నేనును ఒకముక్కను తెచ్చితిని.

ఆనాటి ఫిరంగిగుండు ఒకటి హైకోర్టు ప్రహారీగోడకు - తూర్పుదిశనున్న దానికి తగిలినది. దానివల్ల ఆగోడ కొంత బొక్క పడినది. ఆ విశేషమును తెలుపుచు నాగోడను రిపేరు చేసినప్పు డాచోట నీక్రిందివిధముగా నొకరాతిపై చెక్కించి గోడలో నమర్చి యున్నారు.

"1914 సెప్టంబరు 22 వ తేదిరాత్రి జర్మన్ క్రూయిజర్ 'యమ్డన్' మద్రాసును ముట్టడించినప్పుడు ఒకగుండు ఈ ప్రహారీగోడకు తగులగా ఈ భాగమున కొంత గోడ ఎగిరిపోయినది."

జబ్బుగయుండిన నాభార్య ఫిరంగిశబ్దములకు అదురుకొనగా స్మృతితప్పి క్రమముగ తెలివివచ్చెను. అప్పుడది జరిగెను. ఇటీవలజరిగిన రెండవప్రపంచయుద్ధములో 1941 డిశంబరు జనవరినెలలో జపాను ఓడలు మద్రాసుకు వచ్చుచున్నవని పుకారు కలిగినప్పుడు మద్రాసు జనమంతయు నలుదిక్కులకు పారిపోయినప్పుడు నాభార్యయు ఒంగోలుకు పోయి మా ,బంధువు చివుకుల శ్రీరామశర్మగారియింట మరణించెను.

ఆమె క్రతువులు గడిచినపిదప కొన్నాళ్లు నేను మద్రాసులో ఉంటూఉండగా బర్మాలో జపానువారు విజృంభించుకొలది సింగపూరు పడిపోయినపిదప జపానుసేనలు ఏనాడో మద్రాసులోదిగునన్న భీతాహము ప్రజలలో హెచ్చసాగెను. రోజు రోజును వందలు వేలుజనము మద్రాసువిడిచి ఇతరప్రదేశములకు వెళ్లిపోజొచ్చిరి. ఏప్రిల్ 1, 2 తేదులనుండి కలకత్తాలో బాంబులుపడినవని పట్నములో పుకార్లురేగినవి. 3 వ తేది మాయింట మహాదేవయ్యపెండ్లి. 4, 5- పైవార్తలింకను ప్రబలమైనవి. 6 వ తేది మధ్యాహ్నమున మద్రాసులో తీరమునకు సమీపముగా శత్రునౌకలు తిరుగుచున్నవనియు, ఎప్పుడైన దాడి జరుగవచ్చుననియు, ఈసారి ఊదబోవు హెచ్చరిక బొకా అభ్యాసమునకుగాక, వాస్తవమే అని తలచుడనియు—ప్రభుత్వమువారు శబ్దవిస్తరణ యంత్రసాయమున నగర మంతయు చాటిరి. అందరికి 22-9-1914 నాటి అనుభవము తిరిగి స్మృతికివచ్చెను. నేనును బంధువులను స్థళాంతరమునకు పంపుటకై రైలుకువెళ్లియుండి మిత్రుల బంధువుల బలవంత మున పట్నమువదలివెళ్లితిని. ఉన్నవారు చిల్లరదొరకక, తినుటకు వస్తువులు దొరకక, హోటళ్లలో కాఫీయుదొరకక చాలబాధపడిరట. 14, 15, 16 తేదులలో పట్నం ముప్పాతికకుపైన ఖాళీఅయినదట. పిదప క్రమముగా తిరిగీ పూటుకొన్నది. అప్పుడారు నెలల పర్యంతము "కేసరికుటీరం" ఆఫీసును తిరుచూరుకు మార్చితిమి. అప్పుడే "గృహలక్ష్మి" నిలిచిపోయి తిరిగీ ఈ సంవత్సరారంభమునుండి వెలువడుచున్నది.

### ముగ్గురు బంధువులు

నేను ముగ్గురు పిల్లకాయలను దగ్గిరదీసి పెంచి పెద్దచేసితిని. వారిలో మొదటివాడు శిష్టా శేషగిరి. వీడు నాకు దగ్గిరబంధువు. వీడిని యింటర్ ప్యాసుచేయించితిని. పిదప గవర్నమెంటు ఇండియన్ మెడికలు స్కూలులోచేరి L. I. M. డిగ్రీనిపొందెను. నాయనుభవ మును వానికి బోధించితిని. క్రమముగ అన్నికార్యములలో సమర్థత కల్గినపిమ్మట కేసరి కుటీరమునకు వైద్యుడుగను, ఆఫీసునకు మేనేజరుగను నియమించితిని. ఒంగోలు కాపురస్థుడగు శ్రీ చివుకుల శ్రీరామశర్మగారి పుత్రికనిచ్చి వివాహమును చేయించితిని. వీరిని నావద్దనే యుంచుకొంటిని. వీనియందు నాకుకలిగిన నమ్మకము, అనురాగముఫలన కేసరికుటీరమును లిమిటెడ్ కంపెనీగామార్చునపుడు వీడికి కొన్ని షేర్లనిచ్చి కంపెనీకి డైరక్టరుగ నియమించితిని. వీనికి బిడ్డలుకలిగి సంసారము పెద్దదికాగానే ఎగ్మూరులో నాకువున్న యిండ్లలో ఒక యింటిని వీడిపేరటచేసి వీడికుటుంబమును నాయింటనుండి అక్కడికి మార్చితిని.

### రెండవ పిల్లవాడు

ములుకుట్ల మహాదేవయ్య. వీడు నాబావమరిది కుమారుడే గాక నా మేనమామ మనుమడు-ఆ పేరటివాడు. వీనినికూడ చిన్ననాటినుండి చదువుచెప్పించి పెంచి పెద్దచేసితిని. వీనికి రావుబహదూరు కవికొండల బ్రహ్మయ్యపంతులుగారి కుమార్తెనిప్పించి నాఖర్చుతో పెండ్లిచేసితిని. వీని వివాహానంతరము వీడు నామాటను తిరస్కరించి తప్పుత్రోవత్రొక్కి నాకువిరోధిఆయెను. అయినను కేసరికుటీరమున నౌకరినిచ్చి నాయింటనే కాపురముంచితిని. వీని కీపెండ్లిచేయుటే నాజీవితములోని గొప్పతప్పు అని యిప్పుడు తోచుచున్నది.

### మూడవ పిల్లవాడు

చివుకుల చెంచుపున్నయ్య. వీడు నామరదలి కొడుకు. వీడినికూడ చిన్నప్పటినుంచి నావద్దనే పెంచితిని. వీడు యింటర్ నాలుగుసార్లు జేస్తుపెట్టినాడు. పిందెగానే పండిపోయెను; తలతిరిగెను. అప్పుడు వీనిని నాయింటనుండి వెడలగొట్టవలసివచ్చెను.

ఆలివంకవారు ఆత్మబంధువులు అనెదరు, కాని వీరిరువురు నాకు ఆత్మ ద్రోహు లయిరి. దురదృష్టవంతులు! వీరినిగూర్చి నేను నిరంతరము చాల చింతిల్లుచున్నాను.

### నెల్లూరి పరిచయము

నెల్లూరిలో నాకు ముఖ్యస్నేహితులు మైదవోలు చంగయ్య పంతులుగారును, (Public Prosecutor) A. సంతానరామయ్యంగారును (V. R. H. School, Head-master), చుండూరి వెంకటక్రిష్ణయ్యగారును (Vakil), విస్సా రాజగోపాలరావుగారును

(Vakil) యుండిరి. మొదటి ముగ్గురును గతించిరి. వీర్ల స్నేహమువల్ల నేను పలుమారు నెల్లూరికి పోవుచుంటిని. నేను ప్రోగ్రసీవు యూనియర్లో యిప్పుడుకూడ మెంబరుగానే యున్నాను. తిక్కన జయంతి ఉత్సవాదులలో పాల్గొనుచుంటిని. దసరా ఉత్సవములలోను పాల్గొనుచుంటిని. ఆ ఉత్సవములలో ఒకరోజు నా ఉభయము. అక్లే చంగయ్యగారు, ఆమంచర్ల సుబ్బుకృష్ణరావుగారును ఉభయముల చేయించేవారు. సభ్యులందరి దొకరోజు-గృహలక్ష్మీ స్వర్ణకంకణ బహుమానములను శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారికిని, శ్రీమతి చిలకపాటి శీతాంబగారికిని, శ్రీమతి కవితిలక కాంచనపల్లి కనకమ్మగారికిని, శ్రీమతి కమలాదేవిగారికిని నెల్లూరి పురమందిరముననే ప్రోగ్రసీవు యూనియన్ తరపున యిచ్చితిని. మొల్లజయంతులను జరిపించి స్త్రీరచయితలకు బహుమానముల నచ్చటనే యిచ్చితిని. నెల్లూరులో జరుగు కార్యములలోను అప్పుడప్పుడు పాల్గొనుచుంటిని. నేను ఒంగోలు ప్రాంతమునకు చెందినవాడనైనను నన్ను నెల్లూరివాసిననియే అందరు అనుకొనెదరు. నాముఖ్య స్నేహితులలో మొదటివారగు మైదవోలు చంగయ్యపంతులుగారు మద్రాసు హిందూదేవాలయముల బోర్డుకు కమీషనరుగ మద్రాసుకురాగానే నాకు నెల్లూరి సంబంధము చాలవరకు తగ్గినది. నెల్లూరిలో నాకు బంధువులు, స్నేహితులు అనేకులు యిప్పటికిని యున్నారు - కొన్నాళ్లు నేను నెల్లూరిలో నుండుటయు జరిగెను.

### నెల్లూరి విద్యార్థుల సంఘము

ఆకాలమున మద్రాసులో నెల్లూరి విద్యార్థులసంఘము వుండేది - ఈ సంఘమునకు చేరిన విద్యార్థులును, నెల్లూరునుండి మద్రాసుకువచ్చి ఉద్యోగములలో యున్నవారును కలసి ప్రతిసంవత్సరము వనభోజనముకు సమీపమునయుండు తిరువత్తూరు, విల్లివాకము, అమింజికరె, అడయారు మొదలగు స్థళములకుపోయి అక్కడ ఒకదినమంతయు గడిపి మరునాడు యిండ్లకు వచ్చుచుందుము. ఈ విద్యార్థులందరుగలసి సుమారు 150 మంది యుందురు. ఈ వనభోజనమునకు విద్యార్థులందరు చందాలువేసుకొని కూడినడబ్బును నావద్దతెచ్చియిచ్చేవారు. మిగత కావలసినడబ్బును నేనువేసి ఆఖర్చులన్నియు చేయు చుంటిని. పోయిన స్థళములో పిల్లకాయలు భలిగుడియాటలు చీట్లాటలుఆడి భోజనా నంతరము సమీపముననుండు కొన్నిచూడదగిన స్థళములకుపోయి వచ్చుచుండిరి. చేయి తిరిగిన ఆంధ్రులను వంటకు తీసుకొనిపోయి మంచి తెలుగువంటలను చేయించి పిల్లకాయలకు తృప్తిగ పెట్టుచుంటిని. ఆవిద్యార్థులలో అన్నికులములవారుండిరి. అప్పుడు ఈ సంఘమునకు గుమ్మడూరి వెంకటరంగయ్యగారు అధ్యక్షులు. వారు ఆచారవంతులగుటచే ప్రత్యేకముగ భోజనమునకు కూర్చుండువారు. వనభోజనమునకు ఆచారము అనాచారములు వుండగూడదని నెల్లూరు కాపురస్థులగు ఏనుగు రాఘవరెడ్డిగారు పట్టుపట్టి

వెంకటరంగయ్యగారి ప్రక్కననే ఆకువేసుకొని భుజించిరి. వెంకటరంగయ్యగారు చాల పెద్దమనుష్యులు గనుక వారిని మన్నించి తానును భుజించిరి. ఈకాలమున అట్టి విద్యార్థి బృందము కానరాదు. ఇప్పుడు నెల్లూరిలోయుండు చివుకుల మాలెకొండయ్యగారు ముంగమూరి విశ్వనాథరావుగారు, సుబ్బారావుగారు, బెజవాడ రామచంద్రరెడ్డిగారు మొదలగువారు ఆవనభోజనమున భుజించినవారె.

విద్యార్థులను జూచిన నాకు ప్రేమఅధికము. పేదవిద్యార్థులకు చాలమందికి చదువు చెప్పించితిని. విద్యార్థినులను B. A, M A, వరకుచదివించితిని. వారందరుకూడ మంచి ఉద్యోగములలో యున్నారు. నేను వారిని చూచినప్పుడు ఆనందించుచుందును. పరులకు చేసిన మేలును చెప్పుకొనకూడదను న్యాయము నాకు దెలిసినను ఈసందర్భములో చెప్పవలసివచ్చినది.

ఇక మద్రాసు కథల నట్లుంచి మావూరిని తిరిగి స్మరించెదను. ఎంతైనను "జననీ జన్మభూమిశ్చ..." అన్నారుకదా!

## మా వూరు

నేను చిన్నతనమున మద్రాసుకు వచ్చినపిదప అప్పుడప్పుడు మావూరగు ఇనమన మెల్లూరికి పోవుచుంటిని. రైలుసౌకర్యము లేనప్పుడు ఉప్పుకాలువ (Buckingham canal)లో పడవలమీద ప్రయాణమును చేయుచుంటిని. ఆకాలమున మద్రాసులో బోటుయెక్కిన కొత్తపట్నంరేవుకు 10, 12 దినములలో చేరుచుంటిమి. బోటుచార్జి మనిషికి ఒకరూపాయి మాత్రమే. అయితే ఈ ప్రయాణమునకు కావలసిన భోజనపదార్థములను చిరుతిండ్లను సమృద్ధిగ తీసుకొనిపోవలయును. వంగవోలు ప్రాంతములనుండి వచ్చినవారు కొందరుచేరి యీపడవ ప్రయాణమును చేయుచుంటిమి. ఇందు స్త్రీలు, పురుషులు, బిడ్డలుయుందురు- పడవనడుపు సరంగులుందురు. దక్షిణపుగాలియుండిన, పడవకు చాపనెత్తిన, పడవవేగముగ పోవును. ఈ చాపను ముతకగుడ్డతో తయారుచేయుదురు. గాలిలేనప్పుడు పడవసరంగులు గడలనువేయుచు పదములను పాటలను పాడుచు పడవను నడిపించెదరు. గడలనువేసి అలసి నప్పుడు బోటుకు మోకునుగట్టి లాగుకొనిపోయెదరు. కొన్నిసమయములందు ప్రయాణీకులు గూడ పడవదిగి సరంగుతోకూడ పడవమోకును లాగుచుండెదరు- ఉప్పుగాలి సోకుటవలన ఆకలి అమితముగనుండును. నీళ్లవసతిగల చోటుచూచి వంటచేసుకొనుటకు పడవను నిలిపెదరు. మేము పడవను దిగి సమీపమునయుండు మంచినీళ్ళ బావివద్దకుపోయి స్నానముచేసి చెట్టుచాటుననో, గుట్టచాటుననో పొయ్యిబెట్టి పుల్లలను యేరుకొనివచ్చి

అన్నమునుమాత్రము వండుకొనువారము. గాలివలన మంట తప్పెలకు సరిగ తగలనందున కొన్నిసమయములలో అన్నము సరిగ పక్వముగాక నసుబాయ అగుచుండును. ఇంటినుండి వచ్చునప్పుడు ప్రయాణీకులందరు కమ్మపొడి, మినుముల చింతపండుపచ్చడి, చింతకాయ పచ్చడి వగైరాలనుకూడ తెచ్చుకొనెదరు. కుట్టుడాకులు కూడ యుండును. పచ్చళ్లు విసుగుపుట్టినప్పుడు పచ్చిపులుసును చేసుకొనెదము. ఆకాలమున నెయ్యి చౌక గనుక సమృద్ధిగ నెయ్యిని తెచ్చుకొనుచుంటిమి. సమీపమున పల్లెలుండిన మజ్జిగదొరుకును. అందరము భోజనముచేసి మిగిలినఅన్నమును రాత్రికి మూటగట్టుకొని, తప్పెలను తోమి దానినిండుగ మంచినీటినితీసుకొని పడవచేరుదుము- పడవలోకూర్చుని కూరుకును పట్టించెదము. పడవసాగును. చల్లబడినపిమ్మట అందరము పడవ పైభాగమున చేరుదుము. పైన గాలి చక్కగ వీచునప్పుడు ఆనందముతో పాటలు పద్యములను పాడుచుందురు. మాతోకూడ ఒక లాంతరయుండును. రాత్రికాగానే అన్నముమూటనువిప్పి ఒకభాగ్యశాలి అన్నిపచ్చళ్లును యొకటిగకలిపి కదంబముచేసి పెద్దఅన్నపువాయను కలిపి చుట్టుకూర్చున్న వారిచేతులలో ముద్దలుపెట్టును. పిడచ లగుటవలన పలుమారు నీరుత్రాగవలసివచ్చును. వెన్నెలరాత్రిఅయిన మరల పడవపైకిపోయి నిద్రవచ్చువరకు కబుర్లు కథలు చెప్పకొనుచుండి పిమ్మట దిగి నిద్రించెదము. ఈ ప్రకారము పడవ ప్రయాణము ఆ దినములలో చేయు చుంటిమి. ఈ పడవప్రయాణములలో కలిగిన ఆనందమును, ఆకలిని, భోజనము రుచిని యిప్పుడు తలుచుకున్న నేను అప్పటివాడనేనా యని సందేహము కలుగుచున్నది.

కొత్తపట్నంరేవులో పడవదిగి వంగోలుకుపోయి అక్కడ మాపెత్తండ్రి యింట్లో బసచేసి మరునాడు మావూరికి వెళ్లునప్పుడు ఒంగోలునుండి వేడివేడి శనగపప్పును, ముంత ఖర్జూరపుపండును తీసుకొనిపోవుచుందును. నా అత్తగారికి మద్రాసు మిఠాయిదినుసులు సరిపడవు. మావూరికి నేనుపోవునప్పుడు గజ్జలగుఱ్ఱపు జట్కాబండిమీద పోవుచుందును. నాబండి వూరికి సమీపించగనే తహసీలుదారుడు వచ్చుచున్నాడని గ్రామమునసబు, కరణము, ముదాం మొదలయినవారు నడుములకు గుడ్డలనుగట్టి దండములనుపెట్టుచు బండిని సమీపించుచుండిరి. తీరా నన్ను గుర్తించి "ఈయన మహాదేవయ్య అల్లు" డని దిగాలపడిపోవుచుండిరి. ఇంటివద్ద బండిదిగగానే అత్తగారు ముందు నామాటలను సవరించును. భోజనమువేళకాగానే దొడ్డిలోయుండు ఎండకాగునీళ్లలో స్నానమును చేయమనిచెంబును కుండవద్దపెట్టును. స్నానముచేయుటకు ప్రత్యేకముగ యీవూరిలో స్థలముయుండదు. గనుక గోడలులేనిదొడ్డియే స్నానముకు మరుగుస్థళము. నేను స్నానముచేయునప్పుడు యిరుగుపొరుగువారు నావద్దకువచ్చి మద్రాసుసమాచారములను అడిగేవారు. ఆకాలమున సోపుతో వళ్లురుద్దుకొనుట వింత. ప్రతివారుదగ్గిరకువచ్చి సబ్బునువాసన చూచిపోయేవారు.

ఈసారి వచ్చినపుడు తమకొొక సబ్బుబిళ్ళను తెచ్చిపెట్టమనేవారు- మద్రాసునుంచి నేనొక చిన్న అత్తరుపెట్టెను తీసుకపోతిని. ఆపెట్టెలో ఆరువిధములైన అత్తరుబుడ్లు అత్తరు బిళ్లలుయుండెడివి. మాకు పాలు, పెరుగు, కూరగాయలు, పచ్చిశెనగమండలు, సజ్జకంకులు వగైరాలు సప్లైచేయుకాపువారు నావద్దకువచ్చి అత్తరువును పూయించుకొనిపోవువారు- వారందరు నన్ను 'నరసయ్యా' యని పిలిచేవారు.

## చె ద ల వా డ తి రు నా ళ్ల

ఈ చెదలవాడ మా వూరియేటి ఆవల వడ్డుననేయుండును. చైత్రమాసములో శ్రీరామనవమికి శ్రీరాముల ఉత్సవము చెదలవాడలోజరుగును. ఈ ప్రాంతములకంత ఈవుత్సవము ప్రసిద్ధమగుటచే పొరుగూరినుంచి వేలకొలదిజనులు సంబరమును చూచుటకు వచ్చెదరు. ఇక్కడ వరగబియ్యముపిండితోను, బెల్లముతోను తయారుచేసిన మిఠాయి, ఏలపుండలు, రంగుమిఠాయి, వేడిగారెలు మొదలగునవి అమ్ము అంగళ్లుండును. దూదినిమ్మ కాయలను అమ్మెదురు. నులకవుండలు, పట్టెమంచములు, ముల్లుకఱ్ఱలు, ఎద్దుల మెడపట్టెలు, నవారుబిళ్ళలు, పశువుల పలుపులు, మోటతోలు మోకులు మొదలగువాటినికూడ యీ తిరునాళ్లలో అమ్ముచుండిరి. ఇదివక విధముగ గృహపరిశ్రమల ప్రదర్శనము అనవచ్చును. ఇక్కడ అమ్ముచుండిన మల్లెపూలదండల వాసనను యిప్పటికిని నేను మరువలేదు. ఇది వేశ్యలుండు స్థలము గనుక చాలదూరమునుండి పెద్దమనుష్యులు వచ్చుచుండిరి. స్వామి రథోత్సవమునాడు బ్రాహ్మణ సంతర్పణజరుగును. ఆ సంతర్పణకు యిప్పుడుకూడ నేను కొంత ద్రవ్యసహాయమును చేయుచున్నాను.

మావూరిలో శివాలయము, విష్ణాలయము- రెండు దేవాలయములున్నవి. శివాల యము గర్భగుడిగోపురముపైన బూతుబండుచిత్రములు సొగసుగ చెక్కబడియున్నవి. ఈ చిత్రములను చూచుటకు పెద్దలు చిన్నలుకూడ చేరి చూచి సంతోషించుచుందురు. ఈ దేవాలయపు అర్చకుడు తంబళాయన. కుష్టురోగి. వైద్యమునుచేయును. విష్ణాలయము అర్చకుడు నంబిఆయన. వీరికొడుకు పైచూపు పిచ్చివాడు - ఈ నంబి అర్చకుడుగూడ వైద్యుడే. ఈ వూరిలో యీ అర్చకు లిరువురు వైద్యమును చేయుచునుండెడివారు. సాధారణముగ పల్లెటూళ్లలో నంబితంబళులే గ్రామవైద్యులు. ఈ విష్ణాలయ ముఖ ద్వారమునకు పెద్దతలుపులను నేను చేయించియిచ్చితిని. ఈ దేవుళ్లు పార్వేటకు (శమీపూజకు వెళ్లునప్పుడు స్వాములవెంట వూరిరంగిరీజులు వార్లయిండ్లలో పురాతనముగ యుండు కత్తులు, బాకులు, ఈటెలు మొదలగు) పురాతన యుద్ధసాధనములతో వెంట వచ్చెదరు. ఈపాత ఆయుధములు వీరికి యెట్లు లభించినవో? విజయదశమినాడు ఆయుధ ములకు మెరుగుబెట్టి పూజించి నమస్కరించెదరు- ఈ వూరి గుండ్లకమ్మయేరు వూరిని క్రమముగ మ్రింగుచున్నది. దేవాలయములనుకూడ కబళించుటకు ఏరు సమీపించుచున్నది.




బొమ్మల కొలువు అమర్చుట

తేజోమూర్తుల కేశవరావుగారు.




దేవీ పూజ

యస్. దుర్గారావుగారు.

# శ్రీ దేవీనవరాత్రులు

శ్రీమతి చుండూరి రమాదేవిగారు

సర్వమంగళ స్వరూపిణియు, లోకైక మాతయు, ఆదిశక్తి అవతారమూర్తియు, సచ్చిదానంద స్వరూపిణియు నగు శ్రీమహాదుర్గయొక్క నవరాత్రోత్సవము లరుదెంచినవి. ఈ ఆశ్వీయుజ శుద్ధ పాడ్యమి మొదలు శుద్ధ దశమి వరకు దేవీనవరాత్రము లన బరగుచున్నవి. ఈ దేవీనవరాత్రోత్సవమున దసరా పండుగనాడు విద్యార్థు లెల్లరు సరస్వతీ పూజ సలుపుదురు.

మహారాష్ట్రులకు గణపతి మహోత్సవములును, గుజరాతీ దేశస్థులకు దీపావళి యును ఎంత ముఖ్యములో, నవరాత్రులతో గూడిన దసరా పండుగ హిందువులకు అంత అత్యంతోత్సాహ పూరితమై, అత్యుత్తమమై యొప్పుచున్నవి.

ఈనవరాత్రుల యొక్క మూలకారణము లనేక విధములుగా చెప్పుదురు. పరమేశ్వరి సర్వలోక కంటకుడగు మహిషాసురుని సంహరించి ముల్లోకములకు మేలొనగూర్చినది ఆశ్వీయుజ శుద్ధదశమి రోజున. అందుచే ప్రతి సంవత్సరము ఆదినము యొక్క వార్షికోత్సవముసల్పి. దివ్యజననిని షోడశోపచార విధుల పూజించి, సహస్ర నామార్చనలుసల్పి ఆదేవి కరుణాకటాక్షములకు పాత్రులై యిష్టకామ్యార్థము లంది యానందింతురు.

ఇంకొక కారణము - శ్రీరామచంద్రమూర్తి రావణాసురుని యొక్క పదితలలను దినమున కొకటిగ తెగగొట్టెననియు, అందుచే పదియవనాడు విజయదశమి పండుగ యనుపేరుతో వ్యవహరింప బడుచున్నదనియు చెప్పుదురు.

మరియొకటి; పూర్వమొక శివభక్తుడు ఈశ్వర పూజసల్పుటకై సంచారము లన్నియు సమకూర్చుకొనుసరికి రాత్రియగుచుండెనట, అందువలన ఆభక్తుడు తాను కష్టించిన దంతయు, శక్తిమాతకు జెందును, ఈశ్వరునకు జెందదే యని విచారించినాడట. ప్రతినిత్యము అట్లే జరుగునుండుటచే ఈశ్వరుడు భక్తుని పరితాపము చూడజాలక ఈశ్వరి నుపలక్షించి, ఈ ఒక్క రాత్రి నాకిమ్మని యడుగగా, 9 దినములు నాకిచ్చినచో ఈరాత్రి యిత్తునని చెప్ప, వల్లెయని సదాశివుడు 9 దినములు యిచ్చినాడట. అవియే నవరాత్రములునూ, ఆరాత్రియే శివరాత్రి యనియు చెప్పుదురు.

ఆనాటి సాయంకాలమున శమీ వృక్షమునకు పూజలు సల్పుదురు. పాండవులు అజ్ఞాతవాసమునకై విరటుని కొలువు చేరబోవు సమయమున తమ ఆయుధములన్నియు

శమీవృక్షముపై పెట్టిరనియు, పుణ్యశ్లోకులగు పాండుసూనుల ఆయుధంబుల దాచి యుంచిన దగుటచే శమీవృక్షము పూజ్యమైనదని చెప్పుదురు.

ఈ దసరాపండుగలో ఆయుధపూజ విరివిగచేయుదురు. బాలురు ఆయుధచిహ్నములగు విల్లంబులు చేతబూని, దశరాగీతములు పాడుచూ పంతులవారితో ఇంటింటకి తిరుగుచూ, పప్పుబెల్లములతో తృప్తిపడుచుందురు.

దుర్గపూజ మైసూరు సంస్థానమందు అతివైభవోపేతముగా జరుగును. ఆ పూజలు పట్టణాలంకారములు, విద్యుద్దీప తోరణాలు, కన్నుల వైకుంఠముగా నుండును. కలకత్తాయందుకూడ కాళీమాత పూజలు జగత్ప్రసిద్ధము.

ఈ పండుగ మహోత్సాహజనకమైనది. బొమ్మలకొలువులు, అల్లుళ్లఅలకలు. అల్లుళ్లను సుప్రసన్నులుగ చేసుకొనుటకై గృహమేధులు పడుబాధలు, ప్రియాగమనమున కెదురుచూచు నవోఢలు, పిండివంటలు, పాయసములు, భజనలు, హరికథలు, ఏగృహము పరికించిననూ ఉత్సాహ పూరితమై యొప్పుచుండును.

తొమ్మిది దినములు దేవీ పురాణపఠనము, కుంకుమపూజ, సహస్రనామార్చన, శాస్త్ర చర్చలు, వేదఘోషలు బంధువులసందడి, యెట్టివారికైన బ్రహ్మానందము అనిపింపకమానవు. దశమినాడు దేవిని యెత్తివేసినప్పుడు యిల్లంతయు చిన్నపోయి నిరుత్సాహముగా యుండును.

కాని ఈ రోజులలో రేషను బాధవలన బంధుమర్యాదలు, అన్నదానములు, అడుగంటినవి. ప్రతివస్తువు రేషనగుటచే చేతినిండ పిండివంటలు, శాకపాకములు వచనమొనరించి పదిమందికి పెట్టుగృహిణులకు ఉత్సాహము తగ్గిపోయినది. మైదా గోధుమ, పంటలు చివరకు కాఫిగింజలుకూడ కరువైన ఈసమయములో యేమి పెట్టగలరు? పండుగనుసరికి పాకీల్లు, మంగళ్లు, నౌకర్లు మొదలైన పదిమందికి పెట్టుబడులు పెట్టురోజులు వెనుకబడినవి.

తిరిగి దేశము సుభిక్షమై అన్నవస్త్రముల కొరతలేక నిత్యకల్యాణముపచ్చతోరణముగాయుండుట యెపుడు కాంచనగునో!

భారతీయులెల్లరు కరుణాస్వరూపిణియగు కాత్యాయనీ దేవిని పూర్వముకన్న నెక్కుడు శ్రద్ధతో నారాధించి, సుఖసంపదలను, ఆయురారోగ్యైశ్వర్యములతోను వర్ధిల్లుదురుగాక.

ఆ దేవి నిశ్చలచిత్తముతో, నిర్మలభక్తితో ఆరాధించిన ఎట్టివారికిని కొంగుబంగారమై, పెరటి కల్పవృక్షమై కోర్కెలొసగుచుండును.




మద్రాసు గవర్నమెంటువారు (G- O. No 125 P, H) 1921 ఫిబ్రవరి 11 వ తేదిన ఆయుర్వేద యూనానీ ఔషధములను మద్రాసు జనరల్ హాస్పిటలలో రోగులకిచ్చి వాటిగుణములను పరీక్షించి తెలుపమని సుప్రసిద్ధ ఆంగ్లవైద్య వేత్తయగు డాక్టరు కోమన్ గారిని కోరినారు. ఈదిగువ నుదహరించిన మూలికలను జనరల్ హాస్పిటలులో యుండు రోగులకు వాడి వాటిగుణములను ఈక్రింద వ్రాసిన ప్రకారము అప్పటి మద్రాసు సర్జన్ జనరల్ అగు మేజరు జనరల్ జి. జి. గిఫర్డుదొరగారికి తెలిపిరి, The Hon'ble Major General G.G. Gıffard G. B: I. K H S. I. M. S. Surgeon General with Govt. of Madras.

## ఏకమూలికా చికిత్స.

1. వస- వసకషాయమును జనరల్ హాస్పిటల్ లో యుండు అనేక రోగులకు వాడిరి. ఈకషాయము అజీర్ణమును పోగొట్టి మంచి ఆకలిని పుట్టించినది. (కషాయం: అర్ధరూపాయి యెత్తు వస, నీళ్లు 12 ఔన్సులు కాచి దించవలసినది, 3 ఔన్సులు- పూటకు 1 ఔ. ప్రకారం మూడుపూటలు సేవించ వలయును.)

2. తెల్లగోలిమిడి- ఇది చిన్న మొక్క. ఆకులు బూడిద వర్ణముగ నుండును. ఇది అజీర్ణమునకు మలబద్ధకమునకు మంచిది. గనేరియా సెగరోగమునకు కీళ్లనొప్పులకు మంచిది.

3. నేలవేము:- ఇది మందులదినుసుల అమ్ము అంగళ్లలో దొరుకును. చేదుగా నుండును. నేలవేము, శొంఠి కషాయమును బెట్టి వాత పిత్త శ్లేష్మ జ్వరములకు వాడిన నెమ్మదించును. క్వాయినా కంటే యిది నిదానముగ పని చేయును.

4. కుప్పింటాకు - ఇది సులభముగ దొడ్లలో లభించు మొక్క. దీని ఆకు రసములో నిమ్మపండు రసమును కలిపి తామర, చిడుములు మొదలగు చర్మవ్యాధులకు వాడినపోవును.

5. మాచిపత్రి:- ఇది హిందువులు దొడ్లలోవేసి పెంచెడు చెట్టు. ఇది నేలను అల్లుకొను చేమంతి చెట్టువలె యుండును. పూజకు వాడెదరు. ఈచెట్టు వెన్నును యెండబెట్టి పొడిచేసి 10 మొదలు 20 గురిగింజలెత్తు వరకు బిడ్డలకు వాడిన కడుపులో యుండు పురుగులు చచ్చిపోవును. మరునాడు ఆముదమును

యివ్వవలయును. ఈచెట్టునుండియే సాంటునిన్ (Santonin) అను క్రిమిహరమందును తయారు చేయుదురు. పెద్దవారు 30 మొదలు 60 గురిగింజలెత్తు వాడవచ్చును. సాంటునిన్ యిచ్చినందున కలుగు దుర్గుణములు మాచిపత్రి యిచ్చినందున కలుగవు.

6. నీరుగొబ్బిచెట్టు- ఇదిచిన్న చెట్టు. నీళ్లునిలుచు గుంటలలో మొలచును. ఈమొక్క ఆకులు చలవచేయును. శోఫ (వాపు)కు, మూత్రమును జారిచేయుటకు మంచిది. దీనివేరు వేడినిపోగొట్టి శరీరముకు బలము నిచ్చును. దీనిని కీళ్లనొప్పులకు మూత్రవ్యాధులకు వాడిన గుణము నిచ్చినది. వేరుకాల్చి బూడిదను నీళ్లలో కలిపి వాడిన శరీరమున వ్యాపించిన వాపు నివారణ అయింది. మూత్రము ధారాళముగ పోవును. ఈచెట్టు వేరుతో తయారు చేసిన కషాయమును శోఫకు పూటకు ఒకఔన్సు ప్రకారము యిచ్చిన శోఫ పాండు రోగములు నివారణ యగును.

7. తెల్లగల్జేరు- ఈచెట్టు ప్రతి పల్లెలోను పట్టణములలోను, సులభముగ దొరుకును. ఈచెట్టువేరు చూర్ణమును వాడినగాని దీనితో కూడ లోహభస్మమును చేర్చివాడినగాని పాండు, కామిల, రక్తహీనత నయమగును. దీనివల్ల ప్రతిరోగికి Diuretic (మూత్రవర్ధకం) పనిచేసినది. వాడిన వారికందరికి మంచి లాభము కలిగించినది. మోతాదు 30 గురిగింజలెత్తు. దినమునకు మూడుమాట్లు.

8. కస్తూరి పసుపు- వరుస జ్వరములకు మంచిమందు. ఇదివుపయోగించిన క్వయినా వాడుట వల్లకలుగు దుర్గుణములు కలుగవు. అయితే దినమునకు 5, 6 పర్యాయములు వాడినగాని గుణము కనపడదు. నిదానముగ పనిచేయును. ఈపసుపు పొడిని 1 మొదలు 2 ఔన్సుల వరకు జనరల్ హాస్పిటలులో బాధపడు చలిజ్వరములకు వాడగ అందరికి గుణమిచ్చినది.






## తల్లిప్రేమ—శిశుపోషణ

శ్రీమతి పి. సత్యవతమ్మగారు



బిడ్డలపై ప్రేమ తండ్రికంటె తల్లికి ఎక్కువఅని, ప్రతివిషయములోను బిడ్డల తాపత్రయమంతా తల్లిదేనని నొక్కిచెప్పొచ్చు. తండ్రిఏదో సంపాదించో, సంపాదించకో, తెచ్చిననాడు భార్యకిచ్చి, తేనినాడు మాట్లాడకుండా వూరుకోగలడు. కాని, తల్లి భర్తతెచ్చినా తేకపోయినా, బిడ్డకు యింత అన్నమో, గంజో, పెట్టి పెంచకతప్పదు. పెనిమిటి సంపాదనపరుడై చేతినిండాయివ్వగలవాడైన బిడ్డలకు మరిరెండు కూరలు, పచ్చళ్లతోను, పిండివంటలతోను రోజులు అతిఆనందముగా వెళ్లబుచ్చగలదు.

ఒకవేళ భర్త ప్రయోజకుడై ఏమీతెచ్చుకోలేనివాడైన, పాపము, ఆతల్లిప్రాణము ఏదోవిధముగా బిడ్డలకు, యింతగంజిఅయినా పోసిపెంచకతప్పదుకదా? ఆపరిస్థితిలో(అనగా) పెనిమిటికి ఏమీతెచ్చుకోలేనివాడైన, ఆతల్లి ఎన్నోపాట్లుపడి ఎందరినో ఆశ్రయించి, ఏగొప్పవారింటనైనా చాకిరీ చేసుకొనో, ఏకూలిపనికెళ్లో, ఎలాగోఆపిల్లల ఆకలిబాధనుతీర్చి పెద్దవాళ్లను చేయకతప్పదు. పెద్దవాళ్లైనఆబిడ్డలు, మంచిబుద్ధిగలవాళ్లైన ఆతల్లితండ్రులను సుఖపెట్టడానికి తప్పక పాటుపడతారు. దుర్మార్గులైన బిడ్డలు 'తల్లిదండ్రులు మమ్మల్ని పెంచేదేమిటి, మేమేపెరిగేము, వాళ్ళను మేము చూచేదేమిటని' ఆతల్లిదండ్రుల ముఖముచూడనైనా చూడరు. ఎటువంటిదుర్మార్గులైనా, ఆతల్లితండ్రులను పూజించినా, బాధించినా, ఆ బిడ్డలుపదికాలాలపాటు బాగుండాలని దేవునిప్రార్థిస్తుంది ఆఅమాయికపుతల్లి. తల్లిప్రేమను మించినది, తల్లిప్రేమతో పోలునది లేనేలేదు.

పిల్లలతల్లులైన నాసోదరీమణులకు, పిల్లలతల్లులుకాబోయే నాసోదరీమణులకు కూడా యీనామాటలను అర్థముచేసుకొని, నామంచినిగ్రహించి, చెడుగును వదలి పెట్టమని, ప్రార్థిస్తున్నాను. మనపిల్లల ఆరోగ్య విషయములో మనముచాలాశ్రద్ధచూపడము చాలా ముఖ్యము. బిడ్డలకు నగలులేవని, నాణెములు లేవని, ఏమీ్దిగులుపడకూడదు. ఆరోగ్యమే

మహాభాగ్యము. బిడ్డలకుమనము ఏమిపెట్టుచున్నామో, మనము పెట్టినపదార్థములు, వాళ్లకు ఆరోగ్యముగా వుంటున్నవా? లేక, ఏమైన బాధనుకలిగిస్తున్నవా? వుదయము నిద్రలేచినది మొదలు, మళ్లీపడుకునేవరకు, వాళ్లుతినేతిండి, త్రాగేనీళ్లు జాగ్రత్తగా కనిపెట్టాలి. గొప్పవాళ్లైనా, పేదవాళ్లైనా నేయి, నూనె మట్టుకుచాలా తక్కువగా వాడడమే శరీరానికి చాలా మంచిది.

ఉదయంకాఫీ, టిఫిన్ లకంటె, బిడ్డలకుయింత అన్నము పెట్టిన చాలామంచిది. అలాగు అన్నము పెట్టేవారు, ధనియాలు, జీలకర్ర, కరివేపాకు, కొద్దిగా వెల్లుల్లిరేకలు, వీటినికొద్ది నేతిలోకాని, నూనెలోకాని వేయించి, కమ్మని పరిమళమురాగానే, రోటిలోవేసి, వాటికి తగినంత వుప్పునుచేర్చి, మెత్తగా పొడిచేసి, (కొంచెము నిమ్మకాయరసమునుకూడాచేర్చిన మరీమంచిది) ఆపొడిని ఒక జాడీలోపెట్టుకొని, పిల్లల అన్నములో మొదటి 4, 5 ముద్దలు ఆపొడితోపెట్టి, తరువాత మజ్జిగతోపెట్టిన, అజీర్తికాని, ఆమముకానిచేయక, తగినవేడినిచ్చి, తేలికగా జీర్ణముఅగును. అటుమీదటమనము ఏమి పెట్టినా జబ్బుచేయదు. ఎక్కువ అజీర్తిగల బిడ్డలకు, కొద్దిగాశొంఠి, నిప్పులమీద కాల్చి, వుప్పువేసి, పొడిగాచేసి, కొద్ది అన్నముమీద ఆపొడినిపెట్టి, నేతినిబాగా మరగనిచ్చి, ఆపొడి అన్నముమీదవేసినపొంగును. దానిని వుపయోగించిన బిడ్డలకు అజీర్తిఅనేది వుండనేవుండదు. యీవిధముగా పేద, గొప్ప అనే బేధములేకుండా, అందరు ఎక్కువగా మందులమీదనే ఆధారపడక, తదనుగుణముగా చేసుకొనిన బిడ్డలకు ఏమీబాధ కలుగదు. బిడ్డలు చాలా ఆరోగ్యముగా వుందురు. నేనును పిల్లల తల్లినగుటయు, పిల్లల విషయములో, కొంత అనుభవశాలినగుటయు, యీసరికి యింతమట్టుకు వ్రాయగలిగాను. యీనావాక్యములు నాసోదరీమణులకు రుచించిననాడు ప్రతినెల నాఅనుభవాన్ని బట్టి, నాకుతోచినవి వ్రాస్తూ, 'గృహలక్ష్మి'కి సేవచేయుగలను. నేను సాహసించివ్రాసిన నామాటలలో గుణాగుణములను పరిశీలించ ప్రార్థన.








## —: ఎండు చింతాకు పచ్చడి :—

చింతచెట్టు చిగిరించుకాలమున ముదురు చింతచిగురునుకోసి యెండబెట్టి పొడిగొట్టి నిల్వవుంచుకొన వచ్చును. కావలసి నప్పుడెల్లను కొద్దిపొడిని తీసికొని, దానికి తగినట్లు యెండు మిరపకాయలను, ఇంగువ, మెంతులు, ఆవాలు వేయించుకొని, మిరపకాయలను ఉప్పును నూరుకొని, పైచింతాకుపొడిని అందులోవేసి కొద్దిగ నీరుచల్లి ముద్దగ నూరవలయును. కడపటి తిరుగ మాతగింజలను వేసి నూరి వాడుకొనవలయును.

## —: ఎండు చింతాకు పొడి :—

పొడిచింతాకును కావలసిన మట్టుకు తీసికొని, వేయించిన మిరపకాయలు, ఉప్పు, యీ మూటిని రోటిలోవేసి మెత్తగ పొడి కొట్టవలయును. దీనిలో వెల్లుల్లినిచేర్చి కొందరు వాడెదరు. ఎండు చింతాకు పచ్చడిపొడి, వంటిలోని చెడ్డనీరు పీల్చును.

## —: చింత చిగురు పచ్చడి :—

చింతచిగురును తీసికొనివచ్చి పుల్లలను, యీనెలను తీసివేసి కొద్దిగవాడ్చి, చిగురుకు తగినంత ఉప్పు పసుపుపొడినివేసి రోటిలోవేసి దంచుటయో, రాతిమీద నూరుటయో చేయవలయును. ముందుగనే బాణలిలో నూనెపోసి, యింగువను మిరపకాయలను, మెంతిగింజలను వేయించికొని పొడిగొట్టి, ఆ పొడిలో దంచిన చిగురునువేసి కలియనూరవలయును. ముద్దగుటకు కొద్దిగ నీరును చల్లవచ్చును. మిరపకాయలు వేయించినప్పుడు కొందరు ధనియాలనుగాని, నువ్వులనుగాని వేసి వేయించి నూరెదరు.

## —: చింత చిగురుపొడి పచ్చడి :—

చింతచిగురును నీడలో ఆరనిచ్చి, కొంచెము పసుపుపొడినిచేర్చి రోటిలోదంచి పెట్టుకొనవలయును. పిమ్మట నూనెలో, ఇంగువను యెండు మిరపకాయలు, మెంతులను పక్వముగ వేయించికొని రోటిలోవేసి పొడిగదంచి దానిలో పైదంచిన చింతాకుపొడినివేసి కలియ దంచవలయును. అందుకు కావలసిన ఉప్పును కడపటవేసి దంచవలయును. ఈ పొడిలోవేసిన ఉప్పు, పచ్చడి కలుపుకొని భుజింపునప్పుడు, ఉప్పు పలుకులు పంటికి తగులుచున్ననే దీని రుచి—ఈ పచ్చడిలో నువ్వులనూనెను వేసికొని భుజించెదరు.

## —: పులి చింతాకు పచ్చడి :—

పులిచింతాకు రెండువిధములు. చిన్నఆకులుగల నేలనల్లు చిన్నతీగె. ఇది సాధారణముగ టెంకాయతోటలలోను, తేమపు దేశములలోను గట్టులమీదను మొలుచును. పెద్దజాతికూడ చిత్తడి ప్రదేశములలోనే మొక్కలుగ మొలుచును. దీని ఆకులు పెద్దవిగనుండును. పుల్లగనుండును. పైత్యహారము లయిన శాకములు. వీటి ఆకులలోని ఈనెలుతీసి కొద్దిగ వాడ్చి, నూనెలో యింగువ, మిరపకాయలు, మెంతులు, జీలకఱ్ఱను పక్వముగ వేయించుకొని వేడిగనుండినప్పుడే బండమీదనూరి, వాడ్చిన పులిచింతాకును, ఉప్పును దానిలోవేసి ముద్దగా నూరవలయును. పచ్చడి పుల్లగను, రుచికరముగను యుండును.

## —: పుల్లమామిడి ఆకు పచ్చడి :—

పుల్లమామిడిచెట్టు సాధారణముగ తోటలలోవేసి పెంచెదరు. ఇది చిన్నమాను. దీని కాయలు చాల పుల్లగ నుండును. ఈ చెట్టు చిగురును కావలసినంత తీసికొని బాణలిలోవేసి కొద్దిగవాడ్చి పైచెప్పిన పులిచింతాకువలెనే ముద్ద పచ్చడిగా నూరవలయును. ఈ పచ్చడి మామిడికాయ పచ్చడి వాసనవచ్చును. దీని కాయలను ఉప్పులో వూరవేసెదరు.

## —: శీకాయ ఆకు పచ్చడి :—

ఈ చెట్టు ముండ్లతోకూడుకొనిన తీగె. ఇది కొండప్రదేశములలో విరివిగ చెట్లమీదికి ప్రాకును. దీని చిగురు పుల్లగనుండును. ఈ చిగురువాడ్చి పులిచింతాకు పచ్చడి వలెనే, పచ్చడి నూరవలయును. జ్వరానంతరము యీపచ్చడి నోటికి హితవుగనుండును.

## —: గోంగూర పచ్చడి :—

గుంటూరుజిల్లా గోంగూరకు ప్రశస్తము. ఈ జిల్లావారు గోంగూరను ప్రతిదినము వాడెదరు. గోంగూరలేని శుభకార్యము సాధారణముగ జరుగదు. గోంగూర పుల్లగను, రుచిగను యుండును. దీనిలో లోహపదార్థముకూడ యున్నది. గోంగూర పచ్చడికి లేతఆకు బాగుండును. ఆకులలోని కాడలను గిల్లివైచి, ఆకులను కొద్దిగవాడ్చి అందులో పచ్చి మిరపకాయలను ఉప్పునువేసి నూరవలయును. కడపటి కొతిమి రాకునుచేర్చి నూరవలయును. లేక నూనెలో యింగువ, మిరపకాయలు వేయించి, మెంతులను కొద్దిగచేర్చి వేగిన పిమ్మట ఉప్పునువేసి నూరి, గోంగూరను కలిపి నూరవలయును. ఈ పచ్చడిలో కొందరు ఉల్లిగడ్డను చేర్చి నూరెదరు.



అమృత హస్తలు

# గృహలక్ష్మికి పద్యరత్నములు

శ్రీ కల్లూరు అహోబలరావుగారు

౧

శ్రీ రంజిల్లగ, గృహమును
సారమతిం దిద్దితీర్చి, సంసార, మహో
దార జలధిలోపల, వి
హారంబును సల్పు జాణయా గృహలక్ష్మీ!

౨

శ్రీ విష్ణుని వక్షంబునఁ
దావాసము సేయులక్ష్మి, దయతో నిన్నున్
ప్రోవుత విభవము లొసగియు
నే వేళన్ శుభములందుమీ · గృహలక్ష్మీ!

3

నీ కోటికిఁ గొన్నినీతుల
సాకల్యంబుగను జెప్పఁజాలెదవానిన్
కై కొనుచు, నిండు మదితో
మే కొనవమ్మా! శుభము సుమీ! గృహలక్ష్మీ!

౪

బాలికవు నీవు ప్రకృతము
బాలిక తన మిట్టు లెపుడు బరగదు; వయసుల్
లీలల తోడనె కడచును
బాలికవై, గృహిణివగుదు; వర గృహలక్ష్మీ!

౫

గృహలక్ష్మి వయి, తరింపను
గృహధర్మములెల్ల నేర్చి కీర్తిని బొందన్
మహినొక్క సూత్రమున్నది
సహనము, శాంతంబు వలయు; జయ గృహలక్ష్మీ!

# శరన్నవరాత్రములు

శ్రీ వంగోలు వెంకటరంగయ్యగారు



ఆశ్వయుజ కార్తికమాసములు శరదృతువగుటచే ఆశ్వయుజమున జరుగు నీనవరాత్రములకు శరన్నవరాత్రములని పేరుగలిగింది. ఇటులనె చైత్ర వైశాఖములు వసంతఋతువగుటచే చైత్రమున ప్రవర్తింపబడు. శ్రీ రామోత్సవములకు వసంతనవరాత్రములని ప్రతీతిగలదు. నవరాత్రములని తొమ్మిది రాత్రుల సంకేతము ఆగమనిష్ఠమైయుండు. కొన్ని అనుష్టానములకు సద్యోదీక్షయు, కొన్నిటికి త్రిరాత్రదీక్షయు, కొన్నిటికి సప్తాహ్నికదీక్షయు, మరి కొన్నిటికి నవరాత్రదీక్షయు ఇత్యాది విధమున కల్పోక్త విధానప్రకారము జరుగుచుండును. ఈ దేవి నవరాత్రములకు దేవీనవరాత్రము, లనియు పేరుగలదు. ఆ దేవి శివశక్తియగు చాముండేశ్వరి. ఏకారణమున నీ నవరాత్రములకు దసరాపండుగు అనియు వాడుకపేరుగలదు? విజయదశమి కలుపుకొని పదిదినములక్రింద లెఖపెట్టి దసరాయందురు కాబోలు! అట్లు గణించువారు "దసరా" శబ్దమును దశరాత్రి వికృతియందురు కాబోలు, ఈ సమర్పకను సరియైనదిగా నుండదు. సాధారణముగ నవరాత్రి దీక్షావిసర్జనము మహానవమి రాత్రిలోనె జరుగుచున్నది. 'శ్రవణాంతె విసర్జయెత్' అని వచనమును గలదు. అయితే ఈ వాక్యము ముఖ్యముగ మూలానక్షత్రమున ఆవహింపబడు సరస్వతీదేవి పూజకనియు కొందరు చెప్పెదరు. అదెట్లున్నను దేవి యుక్తమయిన దేమియు దశమినాటికి యుండదు. అయితే వాడుకలో "దసరా" యను నొకమాటయున్నది. భాషలో "దసహర" యనొక పదమున్నది. దానిని నవరాత్రములతో సంబంధబెట్టి "దసరా" యనుమాట కల్పింపబడియుండును, "దసహర" కు నవరాత్రములకును ఎట్టి సంబంధములేదు-"దశహరా" ప్రకరణము పేరుగనున్నది. ఇది గంగావతరణము (అనగా గంగానది సామ్యమువలన నీకలవరమేర్పడి యుండును- దుర్గాపూజా విధానములో విజయదశమినాడు కొందరు దుర్గాదేవికి దసహరపూజ చేయుదురట.

హిందువుల పండుగులు కొన్ని రామకృష్ణాది మహాపురుషుల దివ్యచరిత్రములతో సంబంధపడియున్నది. శ్రీరామనవమీ, గోకులాష్టమీ, నరకచతుర్దశి, నృసింహ జయంతి లోనగునవి గణమున జేరుచున్నవి. సంవత్సరాది, పెద్దపండుగ (మకర సంక్రాంతి) రథసప్తమీ లోనగునవి జ్యోతిష సంబంధము గలిగియున్నవి. తొలి ఏకాదశీ, శ్రావణ శుక్రవారములు-వినాయకునిచవితి-అక్షయ తృతీయ, భోగిపండుగు, కనుముపండుగు గొబ్బెమ్మ పండుగులు లోనగునవి పాడిపంటలు ధనధాన్య సంపదలు లోనగు దేశకాలస్థితులగును సస్యాదుల సమృద్ధికిని కృషీవల సౌభాగ్యమునను సంబంధింపజాలై యున్నవి-ఈ నవరాత్ర పండుగులను దేశము సస్యసమృద్ధిమై ఋతుధర్మరీత్యా జైత్రయాత్రాదులకును సన్నాహములు చేయబడ దినములుగ నుంటున్నవి. వాల్మీకి శ్లేషయుక్తముగ జెప్పినటుల శరదాగమనముతోటి నదుల ప్రసాదము కలుగుచున్నది.

విష్ణువుయొక్క అవతార కథలందుగాని లీలలందుగాని నవరాత్రుల ప్రశంసకుతగిన యంశములగ పడలేదు. గౌరీపూజతో సంబంధపడియుండు గొబ్బెమ్మపండుగులను శ్రీ ఆండాళూదేవి తిరుప్పావై అను ముప్పది పాశురములద్వారా (పద్యములద్వారా) వైష్ణవము కల్పించుకొన్నారు. నవరాత్రములకింకనూ పూర్తి వైష్ణవమిప్పించినటుల యగుపడదు. అర్జునులోను రామునితోను విజయదశమీ శమీవృక్ష పూజకు

కొంత ఆధారము పురాణముల నగపడుచున్నను మహానవమంత్యమగు నవాహ్నిదీక్ష కట్టి సంబంధము మృగ్యముగనున్నది. ఈ నవరాత్రములు కేవలము శాక్తేయ సంబంధములుగ నగపడుచున్నవి. మార్కండేయ పురాణమునందలి దేవి మాహాత్మ్య ఘట్టమునందు దేవియొక్క అవతారవర్ణముగలవు. మొదటిది మహామాయ. ఈ యవతారమున మధుకైటభుల నిధనమునకు సాయపడినది, రెండవది మహిషాసుర మర్దని- మూడవ దానియందు శుంభనిశుంభుల సమయించుట-నాల్గవ యవతారమున నందగోపుని పుత్రిక యోగమాయ, అయిదింట లోకకంటకుడగు నొక రాక్షసుని తన దంతములతో చీల్చి చంపి రక్తదండియను పేరు ప్రసిద్ధమయినది. ఆరవ యవతారమున లోకమున ప్రజలను క్షామబాధలనుండి రక్షించి శాకాంబరియను పేరు వహించిరి. ఏడవ యవతారమున దుర్గాదేవి. ఎనిమిదింట మాతంగియు, తొమ్మిదవ యవతారమున భ్రమరిగను యవతరించినది. (ఈయవతారముల విషయము హైదరాబాదులోనుండు విద్యాధికులు శ్రీ సూరవరపు ప్రతాపరెడ్డి బి. ఏ. బి యల్ గారి "హిందువుల పండుగలు" అనుగ్రంధముననుండి గ్రహింపబడినది.)

ఈ మహానవమీ పండుగులలో బాలురు బాలికలు వివిధములగు యుడుపుల ధరించుచు వేషముల వేసికొని ఇంటింటికి పోవుటయు, పల్లెకూటములలోని బాలబాలికలు "జయ-విజయీభవ" అను మొదలగు హర్షోత్సాహ పూరితములగు స్తుతి వాక్యముల జెప్పుచు స్తోత్రరూపములగు పద్యముల పాటలబాడుచు, కొందఱు విల్లంబులను, కొందఱు బాకులను, కొందఱు పద్యములు పాటలు వ్రాసియుండు పలకలను చేతబట్టి వారి పంతులుగారివెంట తమతమ యిండ్లకుపోయి, అచ్చట తమయింట పెద్దవారియెదుట, "అందలాల్పల్లకీలు అమరతేజీలు" "రంగబంగరు మెరుపు రహిపాలకీలు" ఇత్యాది పద్యముల శ్రోత్రపేయముగ పఠించుచు, "ఏడాది కొకసారివచ్చేది మేము-వేడుకార్ధముగాని వెయ్యార్థగావు" అని మొదలగు పద్యముల పాడుచు "అయ్యవారికిచాలు అయిదువరహాలు-పిల్లకాయలకు పప్పు బెల్లాలు" అని మొదలగు ప్రార్ధనారూపములగు పద్యముల పాడుటయు, అట్లై యిండ్లవారు పంచిపెట్టు పప్పుబెల్లాలు వీరు లెస్సగ మెక్కి, ఆటలు పాటలు అర్పులు ఆర్భాటములతో ఊరేగి యుత్సవము చేయుదురు—ఉత్తర హిందుస్థానములో—ముఖ్యముగ కాశీ, మధురా బృందావన ప్రాంతముల ఈ నవరాత్రములలో పిల్లరామలీలలు అనగ శ్రీరామాయణములోని మారీచవధ, ఖరాసురవధ, రావణవధ లోనగు ప్రధానఘట్టముల నాటక రూపముగ నటింతురు. ఈరామలీలా ప్రచారము దక్షిణభాగమున నంతగ కానరాదుగాని విజయనగరమువరకు వ్యాపించి యున్నది.

ఇక పెద్దపులి-సింహము-కోతి మహిషములోనగు వేషములకు శక్తిపూజ (దుర్గాపూజ) ఆధారముగ నగుపడుచున్నది. ఏ వైపరీత్యమునను మన వారు వేసికొనవలసిన వేషములు దుఃఖభావ ప్రదర్శనములకు యేర్పడియుండు మహమ్మదీయుల పీర్లపండుగులలోనికి జొచ్చినవి. ఇస్లాము చరిత్రమున అత్యంత ఘోరమగు యుద్ధము "కర్బలా" యుద్ధము. ఆ యుద్ధములో శ్రీమహమ్మదు పైగంబరువారి కుటుంబమునకు సంభవించిన విపత్తు వారి మతగ్రంధములలోనేమి కావ్యములలోనేమి మహాఘోరతమముగ వర్ణింపబడియున్నది. ఆ నిరుపమాన్యమైన దుఃఖసూచకముగనె నేటికిని మహమ్మదీయులలో "షియా" తెగవారు పీర్ల పండుగు పదియవదినమున (అనగ పీర్లగుండములలో పడుదినమున) చూడశక్యముగాని "మారడి" (రొమ్ముబాదుకొనుట) యనుపేర జరిగించెదరు-ఇట్లు మహాదుఃఖైక భాజనమగు నీ అల్లాసామిపండుగు (పీర్లపండుగు) పెద్దపులి వేషములకు శోభాల వేషములకు, మజ్నూ వేషములకు మరియు ననేక వేడుకలకూ ముఖ్యకాలము

లయినవి. ఇట్లు వేషములు వేయుట, వేడుకలు చేయుట మతసిద్ధాంతములు ఒప్పెదనియాయని అడిగిన వారిలో ప్రాజ్ఞులు పండితులు పెద్దలు (అట్టివారు ఉలెమా అందురు) అట్టి వేడుకలు దెలిసినవ్రాయని మూఢ జనము ఆదరించునేగాని, మతనిష్ఠాపరులు అట్టివాని నేమాత్ర మాదరింపరందురు. వారిలో పామర జనులు చెప్పుటలో పైనచెప్పిన జారకర్జరాయుద్ధములో మహమ్మదు వారి పక్షము వారనేకులు యుద్ధబాధ తప్పించుకొనుటకై పులులవలె, చిరుతలవలె, పిచ్చివారివలె మారువేషముల వేసికొని కాందిశీకులై యుద్ధపు బారినుండి తప్పించుకొనిపోయిరనియు, అట్టి మారువేషముల జ్ఞాపకముగ నిప్పుడు వేషములోనగునవి ఆచరింప బడుచున్నవని యందురు. ఎట్లయిననేమి దుఃఖజ్ఞాపకమగు నీ మొహరంపీర్లపండుగు వినోదములకు వేడుకల కుపయోగపడుచున్నది. ఇకమన హిందూజనము జూడగ వీరును కొంతకాలము మహమ్మదీయులతో పాటు వార్ల పీర్లపండుగులో వారితోపాటు వేషములవేసికొని నూరేగుచు ఇవియొక ధనసంపాదనకు మార్గముగ జూచుచుండిరి. ఇటీవల హిందువులు మేల్కాని పీర్లపండుగలలో ఇస్లామీయులతోకూడ తాము ను ఈ వేష ములు వేయుట యుక్తముగాదనియు అట్లు చేయుట ఒక విధముగ వారి మతము నవలంబించి నట్లుగుననియు తెలిసిగొని ఈ వేషములకన్నిటికిని మనకూ అనాదియగు పునాది మన నవరాత్రులలో కలదనియు కనుగొని పీర్లపండుగులలో హిందువులు వేషములు వేయుట చాలించుకొని, నవరాత్రములలో వేయ నారంభించిరి. ఇట్లు చేయుట మన మహమ్మదీయ సోదరులకు మనసొప్పక నవరాత్రములలో వేషములు వేయుట కాక్షేపణలు చేయ నారంభించిరి. దీనివలన కొంత అన్యోన్య ద్వేషములును అంకురించినవి. మన శక్తిపూజలలో ఈ వ్యాఘ్రాది ప్రశంసనమున్నది. పరాశక్తి అన్నిరూపముల దాల్చినదని నామావళులందు చూడబడుచున్నది. ఉదాహరణములు కావలయునన్న నెన్నియైన జూపదగును. ప్రస్తుతమున శ్రీకాళికాసహస్ర నామావళినుండి గొన్నిటిజూసినజాలును. ఈ సహస్రమున 14 వ నామము "ఖడ్గపాణినీ", 408వ నామము 'వృషవాహినీ,' 409 వ నామము "వ్యాఘ్రత్వ గంబరా" 411 వ నామము "సింహవాహినీ," ఈ యుదాహరణములలో సాము గరడీలకు ఆయుధ పాణులగుటకు "ఖడ్గపాణినీ" నామము చాలును- పెద్దపులి మొదలగు వేషధారణము లకూ 407.409.411 తగియున్నవి. ఇక పెద్దపులివేషములు మనవియగునా మరొకరివి కాగలనా ?

ఇక విజయదశమీ విషయమున దీనికి దేవి పూజతో విశేష సంబంధమున్నటుల లేదు. శ్రావణ బహు ళాష్టమీ నిశీథి సమయము "జయంతి యోగ" మను పేరుతో జ్యోతిషశాస్త్రజ్ఞులు నిర్ణయించినట్లు తెలియు చున్నది. ఆశ్వీయుజ శుక్లపక్ష దశమీ సాయంకాలము (సంధ్యాకాలము) విజయకాల మనబడును- (శ్రీ. సు. ప్రతాపరెడ్డిగారి హిందువుల పండుగులు.)

ఈ దినమున శమీపూజ యేర్పడుటకు కారణమూహ్యముగ నున్నది. అర్జునాదుల బాణబాణాస నములు జమ్మిచెట్టుమీద పెట్టినటుల మహాభారత విరాటపర్వముననుండుటచే "అర్జునస్య ధనుర్ధారీ" అయిన దనుకొందము. శ్రీరామునికిని జమ్మిగల సంబంధమేమియో విచార్యమాణమైయున్నది. రామస్యప్రియ వాదిని, అనువాక్య మెందువలన మిగిలినదో? రాజులకు ఆ విజయదశమి ఉత్తమమైన ముహూర్తముగ మౌహూర్తికలు గణించెదరు. వాడుకలో అక్షరాభ్యాసము మొదలు గృహప్రవేశాది శుభకార్యములకు నిరాక్షేపమగు ముహూర్తముగా గణింపబడుచున్నది. ఆదశమి యదృష్టభాగ్య మట్లు పొందినది.



# దసరా పండుగ

శ్రీమతి చిలకపాటి సీతాంబగారు

ఉ॥ మేడలు మందిరంబులును మేలిమివీథులు సందుగొందులున్
జూడగ నబ్బురంబగుచు సొంపులుఁగుల్కఁ విన్నృత్తగీతముల్
వేడుక గొల్పనెల్ల పృధివీజనముల్ముదమంద వేడ్కఁవె
న్నాడె శుభాస్పదంబయి మహాముదమై దసరా భృశంబుగన్

సీ॥ మల్లెమొల్లలును చేమంతిపూవులనుంచి చాలనేర్పున వింతజడలు వైచి
బలువేడ్కఁ జిల్గువల్వాల నవ్యదేశీయ చానలయట్టి ముస్తాబు జేసి
మేలుబంగారువజ్రాల భూషణముల పొంకముమీఱ నలంకరించి
ముద్దుమోముల తిల్కములదిద్ది కలపముల్ చిఱుత మేనులకు మచ్చికలనంది

గీ॥ కరములకుఁబ్రీతి కుంకుమ బరణులిచ్చి
దాదులను తోడొసంగి ముత్తైదువులను
పసపుకుంకుమలకుబిల్వ బాలికలను
బంపుచుండిరి నవరాత్రిపండుగులకు.

# మతం

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

మతాన్నిగురించి నేటిదినాల్లో మహత్తరంగా కల్లోలాలు బైలుదేరుతూవున్నాయి. మనమూ, మతాన్నిగురించి కాస్తమతిద్దాం. జాతిని పెంపొందించే ఆచారాలను మతంఅంటాం. దీనిని వేదప్రమాణంగా నిరూపించి బోధించేవార్ని మతగురువులనీ, మతబోధకులనీ, మతోద్ధారకులనీ, పీఠాధిపతులనీఅంటాం. యేజాతికామతం రక్తనాడులవంటిదని నమ్ముతాం, ప్రాణపదంగా ప్రేమిస్తాం. యెవరైనా వారిస్వమతము నుండీ పైదొలగితే ఆయానంఘాలు వారిని బహిష్కరిస్తాయి. యీఆచారం అనాదిగా వస్తూవుంది. యీమతాలు ఒండొంటిం అప్పుడప్పుడూ వఱపిడి కలుగుతూనేవుంటుంది. ఆ సమయాల్లో అగ్నిపుట్టి యెంతదూరం దహించినా దహించిందే. రగుల్కొనకనేవుండాలగానీ, రగుల్కొన్న వెనుక అగ్నికిపవిత్రతా, అపవిత్రతా అంటూవుందా? అలాంటిసమయాల్లో రెటమత, యతిమతమనే రెండు మతవాయువులు తూరుపు పడమటి గాలిలా సాయంచేస్తూవుంటాయి.

హిందూమతం, ఇస్లాంమతం, జైనమతం, క్రైస్తవమతం. యింతేకాక రెటమతం, యతిమతం, సమ్మతంఅనేవీ వున్నాయి. అయితే వీటిని యెవ్వరూ ద్వేషింపరు. యివీ ద్వేషమనేదిలేక అన్నిమతాలలోకలిసి వ్యవహరిస్తాయి సుమండీ. హిందూమతం హిందువులది, ఇస్లాంమతం తురుష్కులది, బౌద్ధమతం బౌద్ధులది, జైనమతం జైనులది, క్రైస్తవమతం క్రైస్తవులది యతిమత రెటమతాలకు భేదబుద్ధిలేదని మొదటే మనవిచేశాను.

ఆదిశంకరులచే హిందూమతమూ, మహమ్మదుచే ఇస్లాంమతమూ, క్రీస్తుచే క్రైస్తవమతమూ, గౌతమబుద్ధునిచే బౌద్ధమతమూ, జినుచే జైనమతమూ స్థాపింపబడినమతములు. యీపీఠాధిపతుల పరంపరచే నేటికిని నశింపకవున్నవి. ఇక యతిమతరెటమతాలు జూడండీ స్వశక్తికలదంటే నమ్మండి. ఆనాటినుండీ యెవరిపోషకవర్గం అక్కరలేకుండానే యీనాటికీ ప్రబలపరిస్థితిలోనే నిలబడివున్నాయి. ఇక సమ్మతం అనేది భగవంతునిమతం. అది అత్తిపూతలాగ అగమ్యగోచరంగా సంచరిస్తూవుంది.

మీదు మిక్కిలి యీమతాలన్నీ యెన్నోదినాలనుంచీ మనహిందూదేశంలోనే వున్నాయి. అయితే యీదినసరికి సంఘీభావం అంటూ లేకుండా జ్ఞాతివైరంలాగ ఒకదాని

జౌన్నత్యాన్ని చూచి మరొకటి అప్పుడప్పుడు కాస్త ధగ్గుమంటూ వుంటుంది. తఱచుగా హిందూ ముజలీములయందే యీవిద్వేషాలు కలుగుతూవుంటాయి. ఇందుకు కారణ మేమిటో కాస్తలోతుగా ఆలోచిస్తే కనబడుతుందేమో.

హిందూదేశంలో వేదప్రమాణంగా చూపెడుతూవున్నారు. జాతులు నాలుగూ అని. భగవద్గీతను ఆదర్శంగా పుచ్చుకుంటేకూడా 'చాతుర్వర్ణ్యం మయాసృష్టంగుణకర్మ విభాగశః' అన్నాడు శ్రీకృష్ణుడు. గుణ, కర్మ, అనుగుణంగా నాలుగు జాతులే సృజించా నన్నాడే! యీపంచమజాతిని యెవరు సృజించారూ? కర్మనుబట్టియే తప్పక కలిగియుండు నని వూహింపవచ్చు.

బౌద్ధ జైనమతములు ప్రప్రథమమున యౌవ్వనగర్వముతో హిందూమతంపై దాడివెడలినవి కానీ విజయవంతం కాజాలకపోయింది. కొన్నివందల సంవత్సరములగా మనపై ప్రభుత్వము సాగించియుండిన క్రైస్తవమతముగూడా హిందూమతాన్ని అంతగా రచ్చకుతేలేదు. ఇస్లాంమతావలంబులైన మహమ్మదీయసోదరులు గజనీ మహమ్మదునకు పూర్వమే మనదేశములో కాలువెట్టినట్లు కనబడుతూవుంది. చరిత్రకారుల మాటనుబట్టి యీఇస్లాంమతస్థులు 'హరి ఓం' అని యేనాడు హిందూదేశంలో పాదం మోపేరో నాటి నుండీ నేటివరకు ఆజ్య, అగ్ని, సంపర్కంలా రగుల్కొంటూనేవున్నాయి. పరస్పరసన్నిహిత తత్వంఅంటూ యీరెంటికీ యెందునాలేవు. వేషంగాని, భాషగాని వెయ్యేమిటి కట్టూ, జుట్టూ, బొట్టూ అన్నీని.

యీ జాతిమతాలన్నీ యీలావుండగా మనిషికోమతమంటూవుంది. దాన్నిమార్చ టానికి దాతతరంకూడా కాదుసుమండీ! యిలా మనిషికోమతం వుండేటప్పుడు యీమతవివ క్షతలూ, మతకక్షలూ అంటూవుండడం యెందుకూ? అన్నసంగతి విచారిస్తే, కేవలం స్వలాభాపేక్షకులైన కుక్షింభరుల ప్రచారమే దీనికికారణమౌతుందేమో. మతానికిసంబం ధించిన వాఙ్మయం (The Holy Literature) చూస్తేరూప, ఆచార, వ్యవహారభేదము లేగాని అన్నిటిలోని ధర్మములు, సిద్ధాంతములు ఒకటేనని తేటతెల్లమౌతోంది. దీనినే వివేకానందుడునూ సర్వమత సమావేశమునందు వుద్ఘాటించాడు. నేడు అరవిందయోగి యూ, ఆవాక్యాన్నే బలపరుస్తూ వున్నాడుకూడాను. స్వలాభాపేక్షకులు మతంపేరుపెట్టి అత్యాచారాలు, కుట్రలూ లేవదీస్తూ రాజకీయరంగంల్లోకి దీనినిదింపి పలువిధాలనాట్య

మాడించి, మతసామరస్యాన్ని గంగలో కలిపి వైషమ్యాలు పెంచుతూవున్నారు దేశద్రోహులు. అమాయక ప్రజలు యీవిషయం తెలుసుకోలేక దారితప్పి డొంకలలోపడి ప్రాణాలు అర్థాలు గోలుపోతూవున్నారు.

ఒక దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందంటే ఆప్రజలకు క్రమశిక్షణక్రింద చట్టబద్ధమైన వాక్కు, బుద్ధి, క్రియాస్వాతంత్ర్యాలూ, మతస్వాతంత్ర్యంకూడా వచ్చినవన్నమాటే యిట్టి స్వాతంత్ర్యమే మతసామరస్యతకు దారిచూపుతుంది. యేదేశం రాజకీయాలు మతసిద్ధాంతంపై నడిపింపబడుతూవుంటాయో, ఆదేశం మిగతదేశములతోపాటు ముందుకుసాగి వెళ్ళలేదు. అలాంటిమూఢనమ్మకంపైన ఆధారపడివుండే మతసిద్ధాంతాలను ఆధారంగాగొన్న సంస్థ కేవలంఅల్పమైన పక్షపాత మార్గాన్నే అవలంబిస్తుంది.

యీవిషయం భారతనారీ శిరోమణులందరూ గమనించి దేశక్షేమానికై బద్ధకంకణులై విద్వేషాలకు కారణభూతమైన రెటమత, యతిమతాలను ప్రవేశింపనీక తియ్యని మాటలతో అరికట్టి, సమ్మతమనే పవిత్రమతాన్ని వ్యాపింపజేసి, సమ్మతితో ముందుకు నడిపించుటే శ్రేయస్కరం మహాత్ములకు సమ్మతమగుమతం.

# శ్రీమతి మూల్పూరి చుక్కమ్మగారు

ఈమె పశ్చిమగోదావరిజిల్లాలో మర్యాదగల ఒక సామాన్య రైతు కుటుంబంలో జన్మించినది-ఈమె పుట్టిల్లు ఏలూరుతాలూకా పెదవాడగ్రామము. వారిలో బాల్య వివాహము నిర్బంధము కాకపోయినను-బాల్యముననే ఆమెకు వివాహమైనది. కాని దురదృష్టముచే-ఆమెకు 11 వ ఏటనే వైధవ్యము తటస్థించెను. మామూలు చదువుట, వ్రాయుట వరకే విద్యనేర్చియున్నను, పూర్వజన్మ సంస్కారమున ఈమె సంఘసంస్కరణాభిలాషిణియై, 19 వ సం ॥ లేతప్రాయముననే, సంఘాచారముల తిరస్కరించు సాహసమున కొడిగట్టి 1919 లో శ్రీ డాక్టరు మూల్పూరి రంగయ్యగారిని వివాహమాడినది. నాటినుండియు భార్యాభర్తలిరువురును సంఘ సంస్కరణ పరాయణులై, దేశభక్తులై, సంఘసేవయు, దేశసేవయు జేయుచున్నారు.

1930 సం॥ న ఉప్పు సత్యాగ్రహమున ఉభయులుపాల్గొనిరి. " స్త్రీసత్యాగ్రహనిధి " యనుపేర ధనవంతమైన ఆ జిల్లాలో కొన్నివేల రూపాయలు వసూలుచేసి స్త్రీలలో అద్భుత ప్రచారమును గావించిన దీమె. ఈమెయు భర్తతోపాటు ఆ ఉప్పుసత్యాగ్రహముననేగాక, పిదప 1932 సం ॥ న శాసననోల్లంఘనమున పాల్గొని రెండుసార్లు వారితోపాటు తానును ఖైదు ననుభవించినది. అంతేకాదు; పలువురుపురుషులే ఆ 1932 శాసనోల్లంఘనమున ఒక్కసారి జైలుయాత్ర చేసివచ్చి మ్రొక్కు చెల్లించు కొంటిమని తృప్తిపడియుండగా, గాంధీ ఆజ్ఞానుసారమీమె 1934 లో కూడ వ్యక్తి సత్యాగ్రహమొనర్చి శిక్షపొందినది.

1937 సం ॥ న కాంగ్రెసు తరఫున జిల్లాబోర్డు సభ్యురాలై ఆహోదాలో 1941లో వ్యక్తి సత్యాగ్రహమొనర్చి, నాల్గవసారి జైలుయాత్ర వెడలివచ్చినది.



మరియు, 1930 సత్యాగ్రహపు రోజులలోనే కాబోలు, తనయావదాస్తిని, ఆ కాలమున రమారమి 5000/-ల విలువగల దానిని, దానమొనర్చి, ప్రజాహిత కార్యములకు వినియోగింపవలయునని నిర్ణయించినది. కడీ ధనము-ముఖ్యముగా స్త్రీవిద్య హరిజనోద్ధరణము, బాల వితంతు వివాహములకు ప్రోత్సాహము-అను మూడు ఉత్తమకార్యములకు ఏటేట వినియోగమగుచున్నది.

కాంగ్రెసు కార్యక్రమమందు ముఖ్యముగా నీ భార్యాభర్తలు - హరిజనోద్ధరణము, స్త్రీ ఉద్యమములు మున్నగు సంఘ సంస్కరణ పరాయణమగువానిని దీక్షతో సల్పుచుందురు.

శ్రీ డా॥ రంగయ్యగారు కుటుంబ నిర్వహణార్థమై-వైద్యవృత్తి గావించుకొనుచు, ఎడతెగక కాంగ్రెసు కార్యక్రమమును సాగించుచుందురు. వీరు కొన్నాళ్లు జిల్లాబోర్డు అధ్యక్షులుగాకూడా నుండిరి.

శ్రీ చుక్కమ్మగారి కీశ్వరుడు ఆయురారోగ్యైశ్వర్య సౌభాగ్యములనొసంగి బ్రోచుగాక.

# ● ఆనిబిసంటు సతి ●



ఆమె నెన్నగ తరమ
ఆదర్శప్రాయ
అన్నిటను మేటి
ఎవరామె సాటి-

*  *

పరదేశి యైనను
మనదేశ సేవయే
ముఖ్యమని తలచెను
అన్నిటికి నిలచెను.
ఎవరామె సాటి-

*  *

విద్యలకు కూడాను
పెట్టింది బిక్ష-
కాశి విద్యాలయమె
ఈనాడు సాక్షి—
కలరామె శిష్యులు - పెక్కండ్రునేడు-
తలపెట్టినారు - శతవార్షికంబు
సంత సింపంగా-!

*  *

జోహారు లందింతు
ఆయమ్మకిపుడు-
జోహారు జోహారు
ఓయమ్మ యనుచు.

శ్రీ మంగళపల్లి సుబ్రహ్మణ్యంగారు







అజ్ఞానాంధకారమును రూపుమాపి జ్ఞాన దీపావళిని వెలిగించిన భారతదేశ మీనాడు దారిద్ర్యమునందును, అజ్ఞానమందును స్రగ్గి మగ్గుచున్నది. స్వాతంత్ర్య భానుని లేతకిరణము లిప్పుడిప్పుడే ప్రసరించుచుండుటంజేసి ప్రజలును ప్రభుత్వమును పరస్పరసహకారముతో దేశదీప్తిని ప్రకాశమాన మొనర్తురుగాక! ఈ మహోద్యమమునకు పర్వదినమగు విజయదశమి ప్రారంభ దినమగునుగాక! ఏ తత్సుభకార్య విజయమునకు 'గృహలక్ష్మి' ఇతోధికముగా తోడగునుగాక!

దిగుమర్తి జానకీబాయి.

# ఆదర్శనారీమణి



## డా॥ ఆనిబిసెంటు



శ్రీమతి ఆనిబిసెంటమ్మ ప్రస్తుత యుగములో స్త్రీలోకమున కంతటికి ఆదర్శ ప్రాయురాలు. జన్మతః క్రైస్తవులైనను ఆమతమును యవ్వన మందే విడనాడి కొన్ని యేండ్లు నిరీశ్వర వాదము నవలంబించి యుండిరి. కడపట నుమారరువది సంవత్సరముల క్రితము గొప్పతపశ్శాలినియు, దివ్యజ్ఞాన సమాజ స్థాపకురాలును శ్రీమతి బ్లావట్స్కీ అమ్మగారిచే రంచింపబడిన "గుప్తసిద్ధాంతము" అనుగ్రంథమును విమర్శ కొరకు వీరుచూచుట తటస్థించెను. వెంటనే ఆమె మనస్సంతయు మారిపోయెను.

వెంటనే ఆమెకు పూర్వజన్మ జ్ఞానమును తాను వెనుకటి జన్మమున కాశ్మీర బ్రాహ్మణ పండితురాలై జన్మించి యభ్యసించిన వేదవేదంగాది శాస్త్రజ్ఞానము, ఆధ్యాత్మిక తత్వజ్ఞాన స్మృతియు కలిగెను. అది మొదలామె బ్లావట్స్కీ అమ్మగారి శిష్యురాలై దివ్యజ్ఞాన సమాజ సభ్యురాలాయెను. పరమేశ్వరానుగ్రహమునకు పాత్రురాలై సర్వాత్మభావన గలిగి తనయొక్క ప్రజ్ఞావిశేషములనన్నింటిని వినియోగించుచు సర్వ భూతములలోని తత్వమొకటియే యనియు సర్వమత సామరస్యము, సోదరభావము నెలకొల్ప వలెనని ధృఢసంకల్పముతో పనిచేసిరి.

ఈ మహానీయురాలు 1893 లో మనభారత దేశములో నడుగిడెను. అదిమొదలామె హిందూ మతమును స్వీకరించిరి. విదేశనారీ మణియయ్యు గౌనును విడనాడి చీరను స్వీకరించి వసంతాంబిక యయ్యెను. తనయింటిలో భారతీయ పద్ధతిగా పూజలూ, మంత్రములు, జపములు మొదలగున వన్నియు జరుపుచుండెడివారు.

వీరి వక్తృత్వ మత్యద్భుతము. వీరిశక్తి సామార్థ్యము లనన్య సామాన్యములు. వీరు యడయారులో గొప్ప సంస్కృత గ్రంథాలయమును, భారత సమాజమును, గొప్ప జ్యోతి ఆలయమును ప్రతిష్ఠించిరి. ప్రతినిత్యము నచ్చట భారత సమాజ పూజ జరుగును. అట్లే అన్ని మతముల యందును ఉన్న ధర్మములను పరిశీలించి వారిమతాను గుణ్యముగా నిత్యపూజా విధానము నేర్పరచిరి. హిందూ, క్రైస్తవ, బౌద్ధ, జైన, పారశీక శిల్పములను అడయారు దివ్యజ్ఞానమున నెలకొల్పి సర్వలోకమునకు చాటిరి.

మరియు డా॥ బిసెంటు తనజీవిత కాలమంతయు లోకసేవార్థమే గడిపెను. మదనపల్లి, గిండి, మొదలగు పెక్కుచోట్ల విద్యాలయములను స్థాపించెను. ఆధునిక





డా॥ అనిబిసెంటు శతవార్షికోత్సవములు యీనెల దేశమందంతటను జరుపబడెను

విద్యాపద్ధతులను బోధపరిచెను. కాశీలో హిందూ విశ్వవిద్యాలయమునకు పునాదిరాయి వేసినది యీమెయే. భారత దేశములో బాలభట సంఘమునకు చేసినసేవ మఱువరానిది.

బిసెంటుసతి సత్యాన్వేషణమున మహర్షుల ననుసరించి ఎన్నియో తత్వరహస్యములను వెల్లడి చేసెను. ఎవరి శక్తినను సరించి వారు, వుత్సాహముగా దివ్యజ్ఞానమును కనుగొనుటకు అనేక మార్గము లీమె బోధించెను. యిండియాలో దివ్యజ్ఞాన శాఖా సమాజములు నాలుగు వందల ముప్పది ఐదింటిని స్థాపించెను. అవి అన్నియు నేటికిని జీవకళలతో నొప్పారుచున్నవి. వీరురచించిన గ్రంథములు ఆరువందలను మించియుండెను. భగవద్గీతలను, ఉపనిషత్తులను, యోగశాస్త్రములను తర్జుమా చేయించియు రామాయణ మహాభారతాది గ్రంథములపైని ఎన్నియో రహస్యార్థములను ప్రకటించిరి. సామాన్యులకు సహితము అర్థమగునట్లు సులభశైలిలో ప్రపంచమంతటను తను ఉపన్యాసముల ద్వారా జ్ఞానజ్యోతిని వ్యాపింపజేసి అఖండయశము నార్జించిరి.

మహర్షులయొక్క ఉపదేశములను శ్రీ వివేకానంద, రామతీర్థ మొదలగు మహాత్ములవలెనే వీరును యూరపు, అమెరికా మొదలగు ఖండములలో తిరిగి హిందూ మతబోధగావించిరి. ఎనుబది సంవత్సరముల వృద్ధాప్యదశలో సయితము స్టీమర్లలోను, వాయువిమానములలో పర్యటనమొనర్చిరి. విదేశములలో బాల బాలికల యభివృద్ధికై పాటుబడిరి. కాలిఫోర్నియాలో లక్షలాది ధనమును వెచ్చించి బాల బాలికా విద్యాలయములను, వసతిగృహములను, పూజాగారములను నిర్మించిరి.

ఈమె ఉపన్యాసములను వినియు, యీమె రచించిన గ్రంథములను చదివియు జనులు, వీరి భావగాంభీర్యమునకును బుద్ధి సామర్థ్యమునకునూ జోహారు లొసంగిరి. అమ్మగారు బాహ్యా బోధకులేగాక గొప్ప యోగిగానుండిరి. వీరికి గురువులయందు పరమవిశ్వాసము. భిన్నాభిప్రాయములను గౌరవించుట వారిపద్ధతి. తనతో నేకీభవింపని వారియందసూయలేదు. ద్వేషించిన వారియందు ద్వేషములేదు. సూక్ష్మలోకజ్ఞానము కరతలామలకము. వీరియొక్క యోగవిద్యామహిమ, నానా దేశపర్యటన సామర్థ్యము, సత్యవ్రతము జ్ఞానవైరాగ్యాది సంపత్తి మొదలగు ప్రజ్ఞా విశేషము లసదృశములైనీమెలో మూర్తీభవించి యుండుటవలన నీమెను భవానీ అవతారమని శ్రీ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారు మున్నగు మహనీయులు వర్ణించియున్నారు.

వీరు 1847 సం. జన్మించి 1933 వ సం॥ మోక్షప్రాప్తినొందిరి. 1947 జూలై నుండి అక్టోబరు వరకు యీ వీర నారీమణి శత వార్షికోత్సవములు. యీ వార్షికోత్సవములలో యథాశక్తి అందరు పాల్గొని మాతృఋణమును దీర్చుకొందురుగాక.



కుమారి వనజ

అఖిల భారత పారిశ్రామిక కళాప్రదర్శన సందర్భమున యీ చిరంజీవి తన అద్భుత నాట్యకళా నైపుణ్యమును ప్రదర్శించి పెద్దలచే ఆశీర్వచనము పొందినది.

ఈ బాల 'త్యాగయ్య' ఫిలింలో కృష్ణపాత్రను ధరించినది. ఇంత చిన్నవయస్సులోనే కూచిపూడి సాంప్రదాయము, తంజావూరు సాంప్రదాయమును చక్కగా అభ్యసించి నాట్య ప్రదర్శనములను యిస్తూంది.

శ్రీ టి. గోవిందరాజుల నాయుడుగారు యీ బాలనాట్యమునకు మెచ్చి రజితపాత్రను బహూకరించి, ఆశీర్వదించిరి.

# కుష్ఠు ★ బొల్లి

## గ్యారంటీచికిత్స !

తూర్పుఆఫ్రికా - దక్షిణాఫ్రికా - సిలోన్ - బర్మా - సయాం - మలయా - సింగపూర్ - ఫిజీ మొదలగు దేశములలో ప్రఖ్యాతిగాంచి వాడబడుచున్నవి మా ఔషధరాజములే !!!

### ఆఫ్రికా

జాన్ కొల్లాకో. డార్. ఎస్. - సలాం

C/o పో. పో. 86 డార్ యెస్ సలాం. 2-8-1944

సంవత్సరంక్రింద మీరు పంపిన మందు నాకు బాగా పనిచేసినదని మీకు తెలుపుచున్నాను.

మీకు మణియార్డరుద్వారా పంపిన రు. 56/-లకు మీ మందును పంపగలందులకు మిక్కిలి కోరుచున్నాను.

మీ విశ్వాసపాత్రుడు.

(సం) జే. కొల్లాకో

కేటలాగు ఉచితము.

## రెడ్డి & కో.,

(రిజిస్టర్డు)

H. O. గోపాలపురం, (వయా) తణుకు,
తూర్పు గోదావరిజిల్లా

★ బ్రాంచి ఆఫీసులు:— ★

బెజవాడ — గాంధినగరం

వాల్తేరు — R. S. పోస్టు

సికింద్రాబాద్ — 3560. కింగ్స్‌వే

కటక్ — బక్సీబజార్

నెల్లూరు — కాపువీధి

ఫజిల్‌నగర్ — గోరక్‌పూర్ U. P.

# "గృహలక్ష్మి" గృహలక్ష్మికే

శ్రీమతి దీక్షి-దేవిగారు

ఇల్లు మల్లెపువ్వులా వెల్లతో శోభిస్తోంది. ద్వారాలు పసుపు-పారాణీలతో మధ్య ధర్మచక్రంతో జాతీయపతాకాల్లా అలరారుతున్నాయి. గదిగుమ్మాలపై భాగానికియేట వాలుగా రెండేసిజాతీయపతాకాలతో మధ్యఅనేకదేశనాయకుల-ప్రజాసేవకులపటాలతో నిండుగా హృదయానందంగాఉన్నాయి. ఆరోజు ఆగస్టు 12. ఆవేళే నేను యింటికి చేరుకున్నాను. ఇలాఅలంకరించినవ్యక్తి యెవరోమీకుతెలుసా? ఎవరూకాదు మా గృహలక్ష్మి. ఆ మర్నాటినుండీ మా యూరంతా మా యిల్లువలెనే అలంకరింపబడ్డాయి. గ్రామంలోని గృహలక్ష్ములకు మా గృహలక్ష్మి ఆదర్శప్రాయురాలైనందు కెంతోసంతోషించా; గర్వించానుకూడా; గర్వించొద్దుమరీ!!

అసలు 15 కి క్రొత్తఢిల్లీ వెడదామనుకున్నా. కాని మా పల్లెలో ఓమూలకికూడా క్రొత్తఢిల్లీ సరిపోదనిపించింది. కాదుమరీ! మా గృహలక్ష్మిశిరోమణుల అభినివేశాలతో విరాజిల్లుతూన్న మాపల్లెనూత్నశోభ ఏనగరానికొస్తుంది? రాదుగాక; రాదు. కలకల్లాడే మాపల్లె-కిలకిల్లాడే మాపల్లెపిల్లలు; ఎంత ఆనందం!

కాలచక్రం మహావేగంగాతిరిగింది. ఆగష్టు 14 వచ్చింది, సాయంత్రమైంది. భోజనాలుచేసేశాము. రాత్రి 12 అయేవరకు నేనూ-దేవీ-మా ఉషా జాతీయనాయకుల జీవితాలు-వాని విశిష్టతలు చర్చించుకుంటున్నాం. గడియారం 12 కొట్టింది నూతనఖద్దరు దుస్తులు ధరించాం. ముగ్గురంబొట్టుపెట్టుకొన్నాం. (ఇదంతా మా గృహలక్ష్మి కార్యక్రమనిర్ణయమేసుమండీ) మా దేవి "వందేమాతరం" అందుకుంది. మా "ఉష" వీణవాయిస్తోంది. పాటపూర్తయి "జై హింద్" అనేసరికల్లా "బాపుటా" నెత్తారు. ముగ్గురు ప్రణమిల్లాం. క్రిందినుంచి మాముస్లిందర్వాన్ టోపీచంకనెట్టికొని వందనంచేస్తున్నాడు. కాని అతనికళ్ళంట నీరుకారుతున్నాయ్! అది మా ఉషచూసింది. "ఏంబాబా! కళ్ళనీరు కారుస్తున్నావ్?" అంది మాఉష (మేమంతా ఆతన్ని "బాబా" అనిపిలవడం అలవాటు.)

"లేదుబేటీ" అంటూ, మాకు తెలీకుండా ఉంటంకోసం కళ్ళనీరు తుడుచుకు పైకి చూసాడు.

"ఇలారాబాబా!" అందిమాఉష. వీధితలుపుదగ్గిరేసి డాబామీదకొచ్చాడు.

"బాబా! ఏంవిచారిస్తున్నావ్?" అందిమాఉష.

"ఏంలేదుబేటీ! సహస్రాబ్దాలనుండి ఏకఖండంగాఉండి సర్వప్రపంచానికీ శిరోమణిగాఉన్న నా భారతదేశం ముక్కముక్కలైపోయింది. ఈ సమయంలో

స్వతంత్రమా? ఇది స్వతంత్రమా?'' అంటూనే మాట్లాడలేకపోయాడు. ''బాబా! ఈ సమయం తేజస్తిమిర సమయమేకాని యెప్పటికైనా భారతదేశం ఏకంకాకపోదు. ఈ కల్మషతిమిరాన్ని భేదించిననాడే భారతదేశపుఆత్మశక్తి సహస్రముఖాల వెలుగుతుంది. బాబా! భారతదేశం ఏకఖండంఅయేవరకు కృషిసల్పడానికి యువకలోకం సిద్ధంగాఉంది. దానికోసం నీవీసమయంలో చింతిల్లకు''అని ఓదార్చిపంపింది. అతనుకిందకుదిగి ''నమాజ్'' చేసికొన్నాడు. అప్పటినుంచి తెల్లవారేవరకూ మాదేవి జాతీయగీతాలతోనూ మాఉష వీణతోనూ మాగృహం స్వర్గసీమలా అలరారింది.

తొలికోడికూసింది. ముగ్గురం తలంటిస్నేళ్ళుపోసుకున్నాం. భగవదారాధనచేశాం. రాట్నాలుతీస్తూ జాతీయగీతాలుపాడుకున్నాం. ఎనిమిదిగంటలైంది. మా ఉషా-దేవీ కలసివెళ్ళి వూళ్ళోనిగృహలక్ష్ము లందరినీ ఆహ్వానించారు. ఆ రోజు శ్రావణమాసం-శుక్ర వారం. అది స్త్రీలోకానికిపండుగదినం. దానికితోడు స్వతంత్రదినా. అన్నీకలసివచ్చాయి. గృహలక్ష్ములందరికీ వాయినాలూ-ధర్మచక్రంవేయబడ్డ రుమాళ్ళుపంచిపెట్టా రెడ తెరిపి లేకుండా, పదిగంటలవరకూ.

రెండుగంటలైంది. చిన్నపిల్లలందరికీ జాతీయపతాకాలూ మిఠాయీపంచిపెట్టారు. ఆ రోజుమేమంతా హుషార్‌గాఉన్నాం. నాలుగుగంటలకి కార్యక్రమం పరిసమాప్తి అయింది. అప్పుడుబయలుదేరి ముగ్గురం మా పల్లెలో యేర్పాటైన సభకువెళ్ళాం. ఎంత చిన్నపల్లెయైనా సర్వకార్యాలు సలక్షణంగాజరిగాయి. మోహంవాచియున్న స్వతంత్రం వస్తే యెవరిహృదయం ఆనందాబ్ధిలో ఓలలాడదు! అక్కణ్నుంచి బయలుదేరి ఆ మాటా ఈమాటా చెప్పుకుంటూ గోదావరీతీరానికివెళ్ళాం. అప్పుడు మా ఉష

''అరెరెరే పొరపాటైపోయింది'' అందితొందరతో.

''ఏమిటానాటకం?'' అంది మా వేణి వేళాకోళంగా.

''ఏమైతేనేం మించిపోయింది?'' అందిఉష.

''ఏమిటిది? నీ కార్యక్రమమంతా పరిసమాప్తి అయాకేగా బయలుదేరుత మనం'' అన్నా ఆమెవైపుచూస్తూ.

''ఇవాళ 15 'గృహలక్ష్మి' వస్తుంది'' అంది.

''రానీ—''అన్నాను.

''రానీకాదు, అదిమొదటనేచదవాలి'' అందిఉష.

'''గృహలక్ష్మి' గృహలక్ష్మికే'' అన్నాడు.

''అవునన్నయ్యా!'' అందిమాదేవి.

సంధ్యారాగంలో మూడురంగుల మేఘాలుచూస్తూ యింటికి బయల్దేరాం!




# స్త్రీ సమస్యలు

శ్రీమతి చాటపర్తి చంద్రికాంతమ్మ గారు.

గతసెప్టెంబరు సంచికలో "స్త్రీసమస్యలు" అని ప్రకటించినవ్యాసంలో సోదరి కె. సూర్యకాంతం గారు కొన్ని ప్రశ్నలువేసి తనకుతోచిన సమాధానాలు వ్రాసియుండిరి. అందు మొదటి ప్రశ్న, "భర్త ఎంత హింసిస్తున్నా పడి ఊరుకోవడం పాతివ్రత్యమా? ఆసహింపునకు అంతుంటుందా? అలాహింసిస్తున్న భర్తలను భార్యలు ఏంచేయ్యాలి? అని

ప్రస్తుతపు నవనాగరికతా ప్రపంచకములో కొన్ని కుటుంబాలలో, ముఖ్యంగా చాల కుటుంబాలలో భార్యా భర్తలు, అత్తా కోడండ్రు ఒండొరులపై దాడులు సల్పుకొనుట మనమంతా చూస్తున్నవిషయమే. దీనికి ముఖ్యకారణం కొందరియెడల అభిప్రాయభేదములు, మరికొందరియెడ అహంకారముచేత ఒండొరులపై పెత్తనం చెలాయించుదామన్నభావం, వారి వారి తగవులను జాగ్రత్తగ పరిశీలించిన చాలతేలికగ వ్యక్తమగుచుండును. యుగాలుగావస్తున్న యీ సమస్యలు క్రొత్తవిగావు. ఎన్నోపురాణగాధలు చదువుకొనుచున్నారము. సినిమా ప్రపంచములో ప్రత్యేకంగా యీ విషయములు దృష్టియందుంచుకొని తీసిన ప్రత్యేకపు సినిమాలనూ, ప్రతినిత్యము మనయిండ్లయందు జరుగు సంఘటనలు కూడా చూచుచున్నాము. యిట్లు జరుగుటలో స్త్రీపురుషులలో యేదోఒకపార్టీది తప్పులేకుండా తగవురాదుగదా! మనం స్త్రీలం గనుక మనపార్టీని బలపర్చి కేవలం పురుషులనే నిందించడం, పురుషులు కేవలం స్త్రీలను నిందించడం పరిపాటుగా వచ్చుచున్న విషయం.

ఇట్లుగాక, "తప్పులెన్నువారు తమతప్పులెరుగరు" అన్న సామెతకు గురికాకుండా సాక్షిభూతులుగానుండి, చర్చించి గమనించినయెడల సదరు బాధలనుండి విముక్తులయ్యెదరు. అదియునుగాకుండా మనము పుట్టుట ప్రాపంచిక సుఖములననుభవించుటకే, ఇతరులమీద పెత్తనం చెలాయించుటకే అనుభావములుగల వారి మధ్యగూడ ముఖ్యముగా యిటువంటి తగవులుగలిగి పండువంటి సంసారములను కూల దోసుకొనుచున్నారు. ఇట్లుగాక సహధర్మచారిణి అనుపదము సార్థకతపరచిన గృహిణిగల కుటుంబములో భర్తహింసిస్తున్నాడంటే సహించి ఊరుకునే భార్యనిజముగ లోకమాత, మహాపతివ్రత; శాస్త్రిలలో వర్ణించగా చదివి వినుచున్న అనసూయ, సుమతి, సావిత్రి, జానకి మొదలుగాగల ఆదర్శ జ్యోతులకంటె ఉత్తమోత్తమురాలు. యిటువంటి ఉత్తమురాలయిన సాధ్విని హింసించుటకే వివాహముచేసి కొన్నటువంటి అధమాధమ నరపశువు గలడేని ఆమెచేసుకొన్న పూర్వజన్మ ఫలవిశేషమే అయివుండవలయును.

మరియు పురుషులలో దుర్మార్గులు లేరనిగాదు. వ్యక్తిగతముగా ఎవరో కొందరు దుర్మార్గులను తీసుకొని ఉదాహరణకొరకు మనముచూపించుట, "అంగననమ్మరాదు" అనివ్రాసిన భాస్కరశతకములోని పద్యమును వగైరాలను తీసుకొని పురుషులు రావడము, యిది సమంజసమైన విషయముకాదు. దుర్మార్గులయిన వారు పురుషులలోను స్త్రీలలోనుగూడ ఉండియున్నారు. ఆయాపరిస్థితులనుబట్టి దుర్మార్గములలపడుచుండును. దుర్మార్గము లేకుండా జేసికొనిన సన్మార్గమువారిమీద తనంతట తానేపడును.

అందుచేత మనలోనుండు దుర్మార్గతను నిర్మూలించుటకు ప్రయత్నించి రూపుమాపినయెడల మనవారందరు సన్మార్గులయి హింసఅనే పదమునకు తావుండనేవుండజాలదు. అపుడు భర్త హింసించవలసిన అవుసరం ఉండదు. భార్య సహించనక్కరలేదు.

# లేఖలు

శ్రీమతి సూర్యదేవర శకుంతలాదేవిగారు

'గృహలక్ష్మి' లో స్త్రీ సమస్యలు కె. సూర్యకాంతంగారు వ్రాసిన ప్రశ్నలు సమాధానాలు చాలబాగున్నవి. అలాంటివే స్త్రీలకు ఉపయోగించునవి. స్త్రీసమస్యలు, అనే శీర్షికక్రింద స్త్రీలు అడుగు ప్రశ్నలు అనుభవముగల సోదరీమణులు ఇచ్చుజవాబులు ప్రకటించిన 'గృహలక్ష్మి' ప్రతిగృహిణికిగల సమస్యలు తీర్చగలదు అనినమ్ముచున్నాను. ఇక్కడ నేను కొందరి స్త్రీలు అడుగు ప్రశ్నలు జవాబులు వ్రాయుచున్నాను.

ప్రశ్న:-స్త్రీని పురుషుడు మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాడనిఏవిధంగా తెలుసుకోవాలి?

జవాబు:-స్త్రీని పురుషుడు మనస్సు పూర్తిగా ప్రేమిస్తున్నాడనిచెప్పటకు కారణములు కన్పించవు. నేటినాగరికులయితే కామమే ప్రేమని దలచెదరు. ఎక్కువ మంది ప్యాషన్సనూ, అందమును, విద్యయును, ముఖ్యముగా కొందరు ఆస్తిని ప్రేమిస్తారు. కాని మనస్సుపూర్తిగా ప్రేమించే పురుషులు ఎవరు చెప్పుకోదగ్గ గొప్పచూచి ప్రేమించరు. ప్రేమించబడేవారికి తెలియని ఏదోగొప్ప ఆకర్షణ ప్రేమించేవారి మనస్సులో వుండు ప్రాణత్యాగము కూడ చేయుటకు సిద్ధముగా వుంటారు. (ప్రేమగుడ్డిది)

ప్రశ్న:-ఒకేపోలికలో నలుపు తెలుపు మార్పు కలిగినవారిలో తెలుపునే అందముగా భావించెదరు. ఎందువలన?

జవాబు:-తెలుపును అందముగా భావించువారు చాలమంది వున్నారు. నలుపు అయినమనిషి కుదిరికగా చక్కగా వున్నదని భావించువారు కొద్దిమంది. ఎవరు ఎట్లు అనుకున్నా అందము ఆకర్షణ చూచేవారి కళ్లలో, మనసులో వుంటుంది.

ప్రశ్న:-నాకు 10 సంవత్సరముల నుండి 16 సంవత్సరముల వయస్సులో నలుగురు పిల్లలువున్నారు. ఒక్కరు మాటవినరు. ఏమిచేయమంటారూ?

జవాబు:_అవును. స్వతంత్రములేని తల్లులమాట వినని పిల్లలు చాలమంది వున్నారు. పెద్దవాళ్లక్రింద గారాబముతో పెరిగిన తల్లులమాట వినరు. మీభర్త మీమాట వింటే, మీకు పరిచయమున్నచోట మాటవినే మంచిపిల్లలు వుంటే చూచ్చి, అక్కడ మీపిల్లలతో మీరు కొంతకాలము వుండిచూడండి. మార్పు ఏమైనా జరుగుతుందేమో.

[ఆపిల్లలు వాచ్చెడితేనో? గృ॥ సం]

# ఖాదీ ఉత్పత్తి

శ్రీ టి. వి. రాఘవరావుగారు

మద్రాసు ప్రభుత్వంలో, అసిస్టెంటు డెవలెప్‌మెంటు కమిషనర్

సక్రమమార్గంలో నిర్ణీతపద్ధతిలో ఖద్దరు వుత్పత్తికనుక జరిగితే, ఏ గ్రామానికా గ్రామం వస్త్ర స్వయంపోషణ జరగడమే కాకుండా, నగరాలలోవున్న జనానికవసరమైన వస్త్రాలనుకూడా అందజేస్తుందని, మనలను దాస్యవిముక్తులచేసి, నేటి స్వాతంత్ర్యభిక్ష పెట్టిన మహాత్ముడు తదితర అనుభవజ్ఞులు, నిరంతరం చెపుతూవున్నారు

వారు చెప్పటమేకాదు—ఆచరిస్తున్న గ్రామాలు వందలాదిగా, యెన్నో నేటికినీ అనాదినుండి అనుభవిస్తున్నట్లు, మీకు అనేకనిదర్శనాలుకూడా చూపిస్తాను.

వికేంద్రీకరణ పద్ధతిలో అంటే డిసెంట్రలైజ్ మెథడ్ వస్త్రపరిశ్రమను అభివృద్ధిపరచి, సవ్యమైనపద్ధతిలో ప్రజాసామాన్యానికి వస్త్రాలుఅందేటట్టుచేస్తే, జాతీయసౌభాగ్యం పెంపొందించటానికీ, వుపకరిస్తుంది.

ఈ విషయాన్ని మీకు నచ్చేటట్లుచెప్పాలంటే, మీరు అందరూ ఆచరించేందుకు అనువగురీతిని తద్వారా ఏగ్రామానికి కావలసినబట్టలు ఆ గ్రామంలో ఆ గ్రామవాసులంతా, వారివిశ్రాంతి కాలంలో వుత్పత్తిచేసుకొని, అనుభవించి, వారిగ్రామసౌభాగ్యాన్ని పెంపొందేటట్లు చేసుకోడానికి వీలయ్యేటట్లుగా ఒక ప్రణాళికను యివ్వాలి.

ఇది సాధ్యమయ్యేపనేనా? అని మీరుఎవరూకూడా అనుమానపడక్కర్లా. ఎందుకంటే, మనదేశంలో షుమారు ౧౫౦ సంవత్సరాలక్రిందటివరకూ యేగ్రామానికాగ్రామం వస్త్రపరిశ్రమలో స్వయంసమృద్ధిగా



యుండి, అప్పుడు మనదేశంలోవున్న, ఇరవై కోట్లజనాభాకు, కావలసినవస్త్రాలను పూర్తిగాఅందచేయటమే కాకుండా, ఇతరదేశాలకుకూడా లక్షలాది అతిసున్నితమైన మజిలిన్‌తానులు, కాలికోతానులు, అద్దకపు చీట్లీలు, దాదాపు ౧౫౦ రకాలవరకూ, ప్రతిసంవత్సరం, ఎగుమతిచేస్తూవుండేవారు. ౩౦౦ లో నెంబరు వరకూ అతిసున్నితమైన నూలువడుకుతూవుండేవారు. అలాంటిస్థితిలో స్వాతంత్ర్యభారతవర్షంలో, మనం తిరిగి ఆ పరిశ్రమను, పునరుద్ధరించటం, ఎందుకుసాధ్యంకాదు ? తప్పకసాధ్యమవుతుంది.

మనరెండువేల యేడువందల పట్టణాలలో నివసిస్తూవున్న షుమారుఅయిదుకోట్ల పట్టణవాసులలో, కొంతమంది పెట్టుబడిదారులను, ధనికులను బాగుచేద్దామనేదౌర్బల్యానికి, మన ౭ లక్షలగ్రామాల్లోవున్న, ముప్పయిఅయిదుకోట్ల గ్రామవాసులూ, లోనుకాకుండావుండి, తమగ్రామసౌభాగ్యాన్ని పెంపొందించుకుందామనేదీక్షా, పట్టుదలావుంటే, తమను వుద్ధరిస్తామని ప్రతిజ్ఞతీసుకున్న ప్రజాప్రతినిధులు తప్పక గ్రామసౌభాగ్యాన్ని పెంపొందించటానికి అనువగురీతిని వస్త్రోత్పత్తివిషయంలో, ఒక నిర్ణీతపద్ధతిలో, ప్రణాళికనువేసి తీరాల్సివస్తుంది.

ఈ పని జరగాలంటే, 'ఏమయ్యా ! ఇది సాధ్యమయ్యేపనేనా ! ప్రపంచమంతా, పదండిపదండని ముందుకుతోసుకుపోతూవుంటే—ఆధునికయుగంలో అన్నిదేశాలూ విద్యుచ్ఛక్తితో కేంద్రీకరణపద్ధతిలో సెంట్రలైజ్‌డ్ మెథడ్ - పరిశ్రమలనఅభివృద్ధిచేస్తూ, ప్రజాసముదాయపు తీరినకాలాన్ని పెంపొందించి, చదువుసంధ్యలకూ, ఆటపాటలకూ విశ్రాంతియిస్తూవుంటే-నీవేమో యిక్ష్వాకులనాటికాలానికిపోయి, ఏ గ్రామానికాగ్రామం, ఏ కుటుంబానికాకుటుంబం, వారికక్కవలసిన నూలునువడుక్కుని, బట్టనేయించుకోవాలంటున్నావే, ఇది సాధ్యమయ్యేపనేనా అని కొందరు ప్రశ్నవేసారు.

మీరుచెప్పే సిద్ధాంతంప్రకారం రోజంతా రాట్నంత్రిప్పితే, మనిషికి నాలుగణాలుకూడాగిట్టదే, రోజుకు మూడునాలుగువంతులు తక్కువడబ్బువచ్చేపనిచేస్తే, జనాభామొత్తంమీద జాతీయసౌభాగ్యాన్ని ఎట్లాపెంపొందించటానికి వీలవుతుందో, మా కర్థం కావటంలేదయ్యాఅంటారు.

ఇంకాకొంతమంది సామ్యవాదమిత్రులు దేశంలో ప్రస్తుతంవున్న మిల్లులన్నిటినీ జాతీయంచేసుకొని ప్రజలందరకూ కావలసిన బట్టనంతనూ కొద్దినుండీ వర్కర్ల ఉత్పత్తిచేసే ఏర్పాటుచేస్తే ఎన్నోకోట్లప్రజలకు శ్రమతగ్గి వారు ఆకాలాన్ని మరోవ్యాపకంలో సద్వినియోగం చేసుకొనేటట్లుచేస్తే యింతకంటెతేలికగా వుండదాఅంటున్నారు.

మరికొంతమంది పట్టణవాసులూ, విద్యాధికులూ, మిల్లుయజమానులూ ప్రస్తుతం దేశంలోవున్న మిల్లులన్నీ పూర్తిగా పనిచేస్తూవుంటేనే ప్రజలకు బట్టచాలక మనిషికి మనరాష్ట్రంలో అయిదుగజాల మిల్లుగుడ్డ కూడా రావటంలేదే అట్లాంటప్పుడు స్వాతంత్ర్యభారతవర్షంలో దేశానికంతటికి సరిపోయేబట్టను తయారుచేసే యింకాయెన్నో కొత్తమిల్లులపెట్టి జాతీయసౌభాగ్యాన్ని పెంపొందించటానికిబదులు , యిదేమివెర్రి సలహాఅయ్యా అంటున్నారు.

ఈ మూడువర్గాలు యిట్లాఇతరదేశాలమాదిరి, కేంద్రీకరణవిధానంగుండా ఆధునికపద్ధతులలో, వస్త్రపరిశ్రమను అభివృద్ధిచేసి, జాతీయసౌభాగ్యాన్ని పెంపొందింపచేయాలని చెప్తూవుంటే-భారీపరిశ్రమలను కేంద్రీకరణపద్ధతిలో నడిపినప్పటికీ, జీవితావసరాలయిన అన్నవస్త్రాదులనుమట్టుకు, ఎక్కడికక్కడే, వికేంద్రీకరణపద్ధతులలో వుత్పత్తిచేసుకుంటేనేగాని, మనదేశంలో ప్రజాసముదాయానికి, అన్నవస్త్రాలకు కరువులేకుండావుండదని, మనభారతభాగ్యవిధాత గాంధీ, విఖ్యాత ఆర్థికశాస్త్రవేత్త కుమారప్పగార్లు అంటున్నారు. అందుకు ఆచరణయోగ్యమైన మార్గాలుకూడా అనుభవంద్వారా చూపిస్తున్నారు.

(సశేషము)

ఆల్ ఇండియా రేడియో వారి అనుమతిని—

# సంపాదకీయములు

## గాంధీ 79 వ జన్మదినోత్సవము.

గాంధీమహాత్ముడు 78 సం॥లు గడిచి 79 సం॥న ప్రవేశించినాడు. దేశమంతా అత్యుత్సాహంతో ఈ యుత్సవంచేసింది. గాంధీ జన్మదినోత్సవాలు దేశంలో చిరకాలంనుంచీ జరుగుతూనేఉన్నాయి. కాని ఈ సంవత్సరం ఉత్సవం విలక్షణమైంది. ఇంతకాలం ఆయనా, ఆయన అనుచరులైన భారతీయులు, స్త్రీలు పురుషులు, స్వాతంత్రసిద్ధికై పడ్డబాధలన్నీ ఫలితానికివచ్చినవి. దేశానికి సంపూర్ణస్వాతంత్ర్యము, ఐక్యత, శాంతి యింకా చేకూరకపోయినా-మనదేశాన్ని పరాధీనను చేసి ఇంగ్లీషువారుమాత్రం అధికారంలోనుండి పైదొలిగారు. ఆతదనంతరం దేశంలో చెలరేగియున్న కరువుకాటకాలు, ప్రబలినహింసాకాండ, చూస్తే ఈ దేశానికి స్వాతంత్ర్యపోరాటం నాటికన్నా, ఇకపైననే ఆయనఅవసరం ఎక్కువఅని తోస్తున్నది. ఆయన కలకత్తా, నౌఆఖలి, బీహారులలోచేయగలిగినపని, నేడుఢిల్లీలో చేస్తున్నపనీ, చూస్తే-ఆయనచెప్పునట్లు 125 సం॥ లే గాక-1000 సం॥లు ఆయనజీవించడం, ఈ దేశానికిన్నీ ప్రపంచానికిన్నీ అత్యావసరమని మా అభిప్రాయం. లోకమాతయైన శ్రీ దుర్గాదేవి గాంధీమహాత్మునిని చిరాయురారోగ్యములొసంగిబ్రోచుగాకయని కోరుచున్నాము.

## ఆనిబిసెంటుశత వార్షికోత్సవము.

ఆనిబిసెంటుపుట్టి ఈ అక్టోబరు 1 వ తేదిననాటికి 100 సం॥ లు. ఆమెచనిపోయిందిన్నీ ఇటీవలనే, ఆమె ఐరిషుజాతికిచెందినదైనా, ఇంగ్లాండులో పుట్టినదైనా, ఆమెమతప్రచారము ప్రపంచవ్యాప్తమైనా ఆమెభారతదేశాన్నే తన మాతృభూమిగా స్వీకరించింది. పాశ్చాత్యవ్యామోహితులైన భారతీయులకు ఆమె గావించిన భారతజాతీయభావప్రచారము ఆ వ్యామోహమును తొలిగింపగల్గినది. ఈ విధముగా ఆమె భారతస్వాతంత్ర్యసిద్ధికి పునాదివేసినది. మత, సాంఘిక, రాజకీయ, విద్యా, పారిశ్రామిక, ఆర్థిక, కార్మిక, పత్రికాప్రచార, స్వచ్ఛందసేవకాది బహుముఖముల ఆమెభారతరంగమున కృషిసల్పినది. కాంగ్రెసుసందేశము గ్రామములకు గొంపోయినది ప్రప్రథమున ఆమెయే. ఆమెకాంగ్రెసు అధ్యక్షతవహించినప్పుడు తన అధ్యక్షోపన్యాసమును-తానుచదువుసమయమున ప్రతిపల్లెయందును సభచేసి చదువవలయునని ఏర్పాటు చేసినది. భారతజాతీయరంగమున ఆమెప్రవేశించుటచేతనే భారతనారీమణులు రాజకీయములప్రవేశించుటకెక్కువ అవకాశముకల్గినది. సాంఘికముగాకూడ స్త్రీల యౌన్నత్యమునకామె ఎక్కువగా తోడ్పడినది. మామూలు కిరస్తానిప్రచారకు రాండ్రవలె హిందూఆచారవ్యావహారముల నామె ఆక్షేపణముచేయక, వానికి మూలమైన శృతిస్మృతులనే సంస్కరణపరాయణముగా నామె వ్యాఖ్యానమొనర్చి, సనాతనధర్మావలంబులగు వారి నెందరినో ఆమె వప్పించగలిగినది. అట్టిఉజ్వలజీవితము భారతనారీమణులకు నిరంతరము ఆదర్శప్రాయముగానుండుగాక అనినమ్ముచు ఆమె భారతీయులకు చిరస్మరణీయయగుటకై జరుగుచున్న ఏర్పాట్లు సఫలీకృతమగుగాకయని కోరుచున్నాము.

## మైసూరు, నైజామ్ సత్యాగ్రహములు : స్త్రీలు.

మైసూరు, నైజాము సంస్థానములయందు రాచకీయసంస్కరణములకై, భారతస్వాతంత్ర్యసిద్ధి అయిన పిదప, తీవ్రమగు సత్యాగ్రహపోరాటములు సాగుచున్నవి. ఈ పోరాటములలో న్యాయముగా స్త్రీలున్నూ పాల్గొనుచున్నారు. నిరాయుధులగు సత్యాగ్రహులయెడ నాగరికముగ ప్రవర్తించుట నాగరికప్రభుత్వ లక్షణము. అందుముఖ్యముగా స్త్రీలయెడ నాజూకుగా ప్రవర్తించుట అత్యవసరము. స్వదేశసంస్థానములకైన అట్టినీతినియమములుండునని లోకమాశించును. కాని వచ్చువార్తలనుచూడగా ఆ విషయమున ఉభయప్రభుత్వములున్నూ కొరవపడ్డవని తేలుచున్నది. మైసూరువంటి సౌమ్యపరిపాలనగలచోట గూడ స్త్రీలు నిర్బంధింపబడుట, విరివిగాసాగుచున్నది. ఇక నైజాముసంగతి చెప్పనక్కరలేదు. స్త్రీలునిర్బంధింపబడుట, లాటీఛార్జీలకు గురియగుటయునే కాదు. ముసల్మానుదుండగీడులబారిపడి అవమానములపాల్పడుచున్నారని కూడా వినుచున్నాము. ఎన్నడో మధ్యయుగమునజరిగినవన్న అనరాని వినరాని దుర్మార్గములుకూడా ఈ 1947 వ సం॥న జరుగుచున్నవనగా ఎంతదారుణమో చెప్పనక్కరలేదు. శ్రీమతి సరోజినిదేవికుమార్తె పద్మజానాయుడుగారివంటి విద్యాధికురాండ్రు పెద్దయింటిబిడ్డలుకూడా ఈ సత్యాగ్రహమునపాల్గొనుట హర్షింపదగినది. ఈ ఉభయరాజ్యాలఅధిపతులు వెంటనే ప్రజలకోర్కెమన్నించి-అధికారము ప్రజాయత్తమొనర్చి కృతకృత్యులగుదురుగాకయని కోరుచున్నాము.

## ప్రభుత్వాధికారిణి పనికత్తెయగుట.

శ్రీమతి బర్బరాకాజిల్ అనే ఇల్లాలు బ్రిటిష్‌పార్లమెంటులో సభ్యురాలు. వర్తకపుశాఖామంత్రికి (క్రిప్సుకు) పార్లమెంటరీ కార్యదర్శిని. బ్రిటిష్‌ఎగుమతులు విస్తారమైతేనేగాని వారిఆర్థికస్థితి బాగుపడదు. అందుకై వస్త్రపరిశ్రమ 6 నెలల్లో 20% వృద్ధికావాలని ఆ మంత్రినిర్ణయించాడు. ఈ పని నెరవేరడానికి కొన్ని కార్మికసమస్యలు, సాంకేతివిశేషములు తెలియవలసివచ్చినది. అందుకుగాను ఈ ఇల్లాలిని-ఆ మిల్లులలో పనికత్తెగాపనిచేయమని ప్రభుత్వంవారు నిర్ణయించారు. “ఈ సందర్భంలో—ఇల్లాలు మిల్లుకూలిగాపనిచేస్తే కలిగేఫలితాలు, ఆమె గృహజీవితంలో కుటుంబనిర్వహణంలో మిల్లుకూలీపనివల్ల వచ్చే మార్పులు—తెలుసుకుంటాను.” అన్నదామె. రాజకీయాధికారాలూ హక్కులూ, బాధ్యతలూ ఎక్కువౌతున్న ఈ రోజులలో—స్త్రీలు హెచ్చుగావానిననుభవించి నిర్వహింపవలెనవి కోరుతున్నారు. దానిని మేమున్ను ప్రోత్సహిస్తాము. అలాంటప్పుడు—స్త్రీకి ఎంతెంతటి సంఘసేవావకాశాలు కలుగాతాయో ఈ ఇంగ్లాండువృత్తాంతం చక్కగా తెలుపుచున్నది. అయితే అట్టి అవసరమువచ్చినప్పుడు మా సోదరీమణులు సంతోషముతో, వివేకంతో వానిని నిర్వహిస్తారని మా విశ్వాసం.

## సి ని మా

నేడు ‘సినిమా’ ప్రజాసామాన్యమునకు వినోదముకల్పించు సాధనముగా స్థిరపడినది. బ్రిటన్‌లో సినిమా నూచు వారి వివరములనుతెలిసి రిపోర్టుతయారుచేయ నొకకమిటీ ఏర్పడినది. ఆ కమిటీరిపోర్టులో ఈ వివరము తేలినదట :— మొత్తము 100000000 పౌ॥ దాకా సినిమాలకై ఆ దేశీయులు ఖర్చుపెట్టు

చున్నారట. ముఖ్యముగా ఈ ధనమంతా చిన్నటిక్కెట్లవల్లనే వస్తున్నది. వాళ్లు చాలాచిన్నతనంలోనే సినిమాకలవాటుపడుచున్నారు. 5 సం॥ల లోపు బిడ్డలలో ప్రతి 4 గురికి ఒకరు ప్రతివారం సినిమాతప్పక చూస్తారు. ప్రతిముగ్గురు విద్యార్థులలో ఇద్దరుతప్పక ప్రతివారం సినిమాకువెళ్తారు. పురుషులకన్న స్త్రీలే ఎక్కువగావెళ్తారు. వారిలో 30% గృహలక్ష్ములు. వీరిలో తల్లులైనవారు 100కి 16 మంది బిడ్డఏదికోరితే ఆ ఫిలుముకువెళ్తారు. సినిమాచూచేవారిలో ముగ్గురిలోవకరికి 'ఫలానా' చూడవలెననియుండదు. ధనవంతులు చూడడానికి చాలావినోదాలున్నవి; పేదవాళ్లకిదివక్కటే వినోదం. ఒక్కబ్రిటన్‌లోనేకాదు ప్రపంచమంతటా వ్యాపించిఉన్నదీ వినోదసాధనం, ముఖ్యంగా మనభారతదేశంలో బాగావ్యాపిస్తున్నది. ఇది కేవలం వినోదసాధనమేగాక-బోధనాసాధనమనికూడా చెప్పవలయును. ఈ సంగతి గ్రహించియే రష్యామున్నగు దేశాలలో ప్రభుత్వంవారు దీనిని వివేకయుతంగాతీర్చిదిద్ది నడిపిస్తున్నారు. ఇటీవల మద్రాసు ప్రభుత్వంవారు దీనిని దృశ్యబోధనావిధానంగా అవలంబింపనిర్ణయించారు. కాబట్టి పండితులు, ఉపజ్ఞగలవారు విద్యావేత్తలు-దీనివైఖరిని సంస్కరింపవలసియున్నది. 100కి 12 మందికన్నా హెచ్చువిద్యావంతులులేని మనదేశంలో సినిమాద్వారా ఎన్నిఉత్తమసంగతులైనా బోధించవలసిన అవసరమున్నది. అప్పుడిది కేవలం విలాసవిశేషముగాక జాతీయనిర్మాణసంస్థ కాగలదు. కావునప్రభుత్వము తనకర్తవ్యము నెరవేర్పనిచో, అమెరికామున్నగుచోట్ల జరుగుదొంగతనములతో, పచ్చిశృంగారములతో భారతీయులమాధుర్యం పెంపొందించే పురాణగాథలతో, చౌకబారుసంగీతములతో, కూడుకొన్నవై-ప్రజాభిరుచిని; శీలమును ఇవి పాడుచేయగలవు అని మా భయము.

## జమీందారీ బిల్లు

సాంఘికవిప్లవము స్వాతంత్ర్యసిద్ధినంటివచ్చేది. కావున మేము జమీందారీబిల్లును ఆశ్చర్యముగా చూడము. అయితే స్త్రీల బాగోగులనాలోచించు పత్రికయగుటచే, రాణులు, రాజమాతలు, రాచ, కుమార్తెలు-వీరినిగూర్చిమేము యోచించితిమి. పుటకలన్నియు యాదృచ్ఛికములు. జీవిపరికోరి ఏర్పరచుకొనేవికావు, కావున ఈ రాణులు, రాకుమార్తెలు-పుట్టినచోట మెట్టినచోట సాంప్రదాయానుగుణ్యంగా పెరుగుతారు, సాంప్రదాయనుగుణ్యంగా సంచరిస్తారు. వారినొక్కరోజున వీధినిబెట్టడంన్యాయంకాదు. తాము కొల్లబోతున్నప్పుడు ఈ జమీందారులు, రాజమాతలకు రాకుమార్తెలకు ఇచ్చేభత్యములు తగిస్తారు. వీరైతేనున్నచుట్టుతారు. పురుషుడే నూతనపరిస్థితులకు సర్దుకోడంకష్టం. స్త్రీ-అందులో ఆ గర్భశ్రీమంతురాలైనస్త్రీ, చెప్పతిరంకాదు. కాబట్టి-అట్టిరాణులు, రాకుమార్తెలు-తమజీవితాంతంవరకైనా తమ పూర్వస్థితికి మిక్కిలి తక్కువగానిస్థితిలో బ్రతుకుతెరువుసాగించేటటు ఈ బిల్లులో ఏర్పాటుచేయదగును. ఆ రాణులును, రాకుమార్తెలున్ను కాలంమించి వచ్చినదనేసంగతిగ్రహించి తమజీవితమున తగుమార్పులనుకూడా వారు కల్పించుకొని సామాన్యసంఘమున మమేకమైపోవాలి. సహజముగా ఉత్తమకుటుంబంలోపుట్టి ఉదాత్తభావములతోకూడిన అట్టివ్యక్తులు-సంఘంలో మమేకమైనప్పుడు-సంఘంకూడా ఔన్నత్యం వహించగలదు. ధర్మము, శీలము పెంపొందగలదు అని మా విశ్వాసము.

---

## కీ॥ శే॥ కొతా శ్రీరామశాస్త్రిగారు

శ్రీ కొతా శ్రీరామశాస్త్రిగారు 74 వ ఏట-ఈ నెల 9 వ తేదిన కీర్తిశేషులైరి అని తెలియుటకు చింతిలుచున్నాము. శ్రీ శాస్త్రిగారు "గృహలక్ష్మి" ని ప్రారంభించినప్పుడు సంపాదకీయవర్గమున మాకు సహాయకులైయుండిరి. వారంతకుముందు కొన్నాళ్లు నడిపిన "శారద" అను మాసపత్రిక చాలా ప్రఖ్యాతి వహించినది. వారు ప్రప్రథమున వితంతూద్వాహ మొనర్చుకొనుటకు సాహసించినవారిలో నొకరు, వారి కుమార్తె లిర్వురు పట్టభద్రలై ఉద్యోగము లొనర్చుచున్నారు. వారి కుమారులు విదేశములందున ఖ్యాతిగాంచిన చిత్రలేఖకులు- అట్టి ఉత్తమ కుటుంబీకుడు, మాకు చిరకాల పరిచితుడు, స్వర్గస్థులైనం' మిక్కిలి చింతించుచు వారి ఆత్మకు శాంతిగోరుచున్నాము.

---

# దసరా ముచ్చట

శ్రీమతి పొన్నపల్లి అన్నపూర్ణాదేవిగారు

పద్మావతమ్మ — తల్లి

లక్ష్మి — కుమార్తె

లక్ష్మి :—(12 సంవత్సరముల వయస్సు) సాయంత్రము 5 గంటలకు స్కూలునుండి వస్తుంది—
అమ్మా, అమ్మా, ఏం జేస్తున్నావు ?

పద్మా :—(వంట యింట్లోనుండి వస్తూ) యెందుకే అంత హడావడిగా పిలుస్తున్నావు ? (అంటూవచ్చి వీధి తలుపు తీస్తుంది)

లక్ష్మి :—(యెంతో సంతోషముతో) రేపటినుండి 15 రోజులవరకు దసరా సెలవలు యిచ్చారు అమ్మా, ఏరీ, నాన్నగారు యింకా రాలేదా ?

పద్మా :—యిప్పుడే వచ్చి మరల బజారు వెళ్లారు.

పద్మా-లక్ష్మి యిద్దరు కలసి మరుసటి రోజు సాయంత్రము వూళ్లోవున్న దేవాలయములో అమ్మ వారికి అవతారములు వేయుటచే వెళ్లి అలంకారాలనుచూచి వస్తారు. యిలా 8 రోజులు గడచిన అనంతరం 9 వ రోజున కూడ మామూలుగా వెళ్లి యింటికి వచ్చిన తరువాత లక్ష్మి, తల్లిని అడుగుతుంది

లక్ష్మి :—అమ్మా, 8 రోజుల అవతారములకంటె, యీ రోజు అవతారము చాల భయంకరముగా వున్నది. అసలు యీ అవతారములు యెందుకు వేస్తున్నారో-చెప్పు అమ్మా.

పద్మా :—సరే చెబుతున్నా విను.
మహిషాసురుడు అనే రాక్షసుడు దేవతలను అమిత బాధ పెడుతుండేవాడు. యిది భరించలేక దేవతలందరు కలసి దేవినిగూర్చి ప్రార్థించారు. అప్పుడు దేవి వారి మొఱ నాలకించి, 8 రోజులు చెలికత్తెలను పంపగా, వారివలన రాక్షసుడు సంహరింప బడక పోవుటచే 9 వ రోజున దేవి స్వయముగా శక్తి స్వరూపము దాల్చి 9 వ రోజు రాత్రి మహిషాసురుని సంహరించినది. యిందుచేత యీ 9 రోజులకు నవరాత్రిళ్లు అని పేరు. తరువాత పాండవులు 12 సం|| లుఅరణ్యవాసము పూర్తిచేసి, 13 వ సం|| ము అజ్ఞాత వాసము, విరాట్ రాజు దగ్గర మారు వేషముతో వుంటూవుండగా ఉత్తర గోగ్రహణమునకు దుర్యోధనాదులురాగా, మహిషాసురుని సంహరించిన మరుసటి రోజునే, పాండవుల ఆయుధములు జమ్మిచెట్టుపైన వుండుటచే, బృహన్నల వేషముతో వున్న అర్జునుడు ఆయుధములను తీసుకొనివెళ్లి ఉత్తర గోగ్రహణములో విజయము పొందినారు. గనుక రేపటిరోజున విజయదశమిఅని అందరు పండుగ చేసుకొంటారు.

లక్ష్మి :— అమ్మా, దేవి ఆడది అయినప్పటికి అంతటిరాక్షసుని యెలా సంహరించిందో?

పద్మా :— అవునుతల్లీ, పూర్వము సీత, సావిత్రి, దమయంతి, మొదలైన నారీమణులుకూడ, అన్నివిద్యలు నేర్చి, భర్తలకు తోడునీడగావుంటూ, తమ పాతివ్రత్యమహిమచే ఎంతకష్టమైన పనినైనను సాధించేవారు. అందుచేతనే ప్రపంచములో యిప్పటికిని మనమందరము వారిని గొల్చుచు, వారికీర్తిని పొగడుచున్నాము.

లక్ష్మి :— అమ్మా, అయితే యీపండుగకు పిల్లలందరు విల్లంబులుపట్టుకొని ఎందుకే 'జయాభి జైభవ' అంటూ మేష్టర్లతో యింటి యింటికీ తిరుగుతారు?

పద్మ :— పాండవులలో వీరుడైన అర్జునివిలువిద్య ప్రభావముచే గణ్యతకువచ్చిన యీవిజయదశమి పిల్లలందరు విల్లంబులు తీసుకొనుట, వాటితో వారిమనసోల్లాసముగా ఆడుకొనుట యుక్తము గదా. మన హిందువులపండుగలలో యిది ముఖ్యమైనపండుగ అందుచేతనే పిల్లలకు దసరా పద్యాలునేర్పి, ఎవరి ఎవరియింట వారిచేతనే పద్యాలుపాడిస్తూ తల్లి తండ్రులను సంతోషపెట్టి, వారికానుకలను మాష్టార్లుకోర్తారు. వీరుసంతోషముగా యిస్తారు.

అనిపైవిధముగా నవమినాటిరాత్రి చాలాపొద్దుపోయేవరకు తల్లికుమార్తెలిరువురు మాట్లాడుకొని పండుకొంటారు. మర్నాడు ఉదయమే లక్ష్మి తల్లితోపాటులేచి, తనకాలకృత్యములు తీర్చుకొని, తల్లి, తండ్రితోపాటు దేవుని పూజచేసుకొని, భోజనములు అయినపిదప, తండ్రికుట్టించిన క్రొత్త పరికిణీ, గౌను తొడుగుకొని, తల్లితోచెప్పి స్నేహితురాండ్రతో ఆడుకొనటకైవెళ్లి తాను తన తల్లివలన తెలుసుకొనిన దసరాముచ్చటను గురించి వారికిచెప్పి ఆడుకొని యింటికి వస్తుంది. పిల్లలందరు పండుగ సంగతి లక్ష్మి బాగాచెప్పిందని సంబరపడ్డారు. ప్రతిపండుగకు యిలాగే కథ వుంటుందా అని ఆశ్చర్యపడ్డారు.

బిడ్డల అభిప్రాయములకు అనుకూలముగా తల్లిచేసే బోధలమీదే వారి భావిజీవితము ఆధారపడి వుంటుంది. ఆనందమయమైన గృహాలిక్లేవిరాజిల్లుతూ, శోభాయమానంగా వుంటాయి.

---

# భామకలాపం — కూచిపూడి నాట్యం

## శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారికి సువర్ణఘంటాకంకణ సమర్పణము, సన్మానము.



శ్రీ సిద్ధేంద్రయోగులవారిచే రచింపబడిన 'భామకలాపా'న్ని శ్రీ వేదాంతం లక్ష్మినారాయణశాస్త్రిగారు విభావానుభావ సాత్త్వీక సంచారీభావములతోను, నాట్య, నృత్త, లాస్యములతోనూ ఆయా వసంతవర్ణన, సత్యభామ విరహతాపముల,—ప్రోషిత భర్తృక నాయకభావము-విప్రలంభ శృంగారము అత్యద్భుతముగా యీ నెల 9 వ తేదీని అఖిలభారత కళా ప్రదర్శనమున ప్రదర్శించిరి.

ఆ సందర్భమున శ్రీమాన్ మడుంబవెంకటరంగ అనహారాచార్యులవారు శ్రీ శాస్త్రిగారికి సువర్ణఘంటాకంకణమును సమర్పించిరి. శ్రీ తాండవకృష్ణగారు సన్మాన పత్రముసమర్పించిరి. నాట్యాచారులైన శ్రీ గోపీనాద్, శ్రీ బులుసు సాంబమూర్తిగార్లుకూడ ప్రశంసించిరి.

---

# ఆనందోత్సాహాల పునఃప్రాప్తి



పండిత డి. గోపాలాచార్యులవారి

# అరుణ

## గర్భాశయ రోగనివారిణి

చాలకాలంగా గర్భాశయ రోగములతో
పీడింపబడుచు, మూలబడి మూల్గు
తున్న ఆమె నేడు ఆరుగ్మతల
నుండి విముక్తి నొంది, సంపూర్ణారో
గ్యయై, వెనుకటివలెనే విందులు,
విలాసములలో పాల్గొంటూ ఉత్సాహ
పూరిత జీవితమును గడుపుచున్నది.

**ఆయుర్వేదాశ్రమము లిమిటెడ్**
**మదరాసు 17**

---

## : జండూ బాలామృతం :




క్షీణించి అనారోగ్య వంతులుగ
నుండు బిడ్డలకు అమృతము
సీసా 1-కి రు 1-1-0.

జండూవారి ఏజంట్లయొద్ద దొరుకును.

---

# బాలింత

రక్తమును, క్షీరమును వృద్ధిచేయు రసాయనము. సూతికాసంబంధమగు జబ్బులు రాకుండ కాపాడును. నీరసము, దడ, మందాగ్ని విరేచన బద్ధకము, రక్తహీనత లేకుండా చేయును. ప్రసవించిన తరువాత చాలా రోజులవరకు అగు తెల్లమైలను మాన్పును.

బాలింత సేవించిన తల్లులకు క్షీరమును వృద్ధిచేయును. పిల్లలకు లివరు వ్యాధులు రాకుండును. బాలింతలు కట్టెకారము తినవసరము లేదు. ఈమందే ఒడలును గట్టిపరచును.

అన్ని మందుల షాపులలో దొరుకును.

తయారుచేసినవారు :—

ఓషధి ఫార్మస్యూటికల్స్
జి. టి., మద్రాసు.

తెలుగు జిల్లాలకు
గుడివాడ ఆఫీసునుండి పంపబడును.

# శ్రీ సర్వజిత్ నామ సంllర ఆశ్వయుజమాసము

| | తేది | వారము | వివరములు |
|---|---|---|---|
| అక్టోబరు | 15 | బు | శు పా 11-13 స్వా 59-5 విష్కు 38-16 బ 11-13 ది 12-16 త్యా 4-4 శారద నవరాత్ర ప్రారంభం. కలశస్థాపనం. |
| | 16 | గు | వి 10-44 వి శా 60-10 ప్రి 35-34 కౌ 10-44 ది 13-33 |
| | 17 | శు | త 11-32 విశా 1-31 ఆయు 33-48 గ 11-23 ది 12-4 |
| | 18 | శ | చ 13-29 అనూ 4-46 సౌ 32-53 విష్టి 13.29 ది 19.48 ఉపాంగ లలితా గౌరీవ్రతం. |
| | 19 | ఆ | పం 16-27 జ్యే 9-2 శో 32-41 బా 16-27 రా 1-34 త్యా 4-21 పుస్తక రూపిణి సరస్వతీపూజ. |
| | 20 | సో | ష 20-14 మూ 14-6 అతి 33-4 తై 20-14 ది 9-45 రా 11-13 |
| | 21 | మం | స 24-35 పూభా 19-43 సు 33-51 వ 24-35 రా 12-35 దేవీత్రిరాత్రవ్రతం. సత్యపరాయణ పుణ్యదినం |
| | 22 | బు | అ 29-16 ఉ.షా 25-39 ధృ 34-49 బ 29.16 రా 7-33 మహాష్టమీ భద్రకాళీ జయంతి,. సత్యపరాక్రమ పుణ్యదినం. |
| | 23 | గు | న 34-9 శ్ర 31-39 శూ 35-46 బా 1-33 రా 13-3 స్వారోచిషమన్వాది: సరస్వత్యుద్వాసనం, దంపత్యాయుధ కాళీపూజా. |
| | 24 | శు | ద 37 25 గం 36-3 తై 6-73 రా 17-54 విజయదశమి; అపరాజితా దేవీపూజా, శ్రీదేవ్యుద్వాసనం, దుర్గాదేవ్యుద్వాసనం, రాజ్యలక్ష్మీవ్రతం. శమీపూజా, ద్వాదశవ్రతం. |
| | 25 | శ | ఏ 42-23 శ 42-4 వృ 36-55 వ 10-20 రా 30-55 గోపద్మవ్రతారంభం; పెరియాళ్వారు తిరునక్షత్రం, |
| | 26 | ఆ | ద్వా 45-34 పూ. భా 47-15 ధ్రు 36-4 బ 13-53 |
| 1947-వ సంll | 27 | సో | త్ర. ద 47-47 ఉ.భా 50-49 వ్యా 35-5 కౌ 16-35 ది 12-34 |
| | 28 | మం | చ.ద 48-42 రే 54-19 హర్ష 33-56 గ 18.14 ది 21-59 |
| | 29 | బు | ○ పౌర్ణమి 48-40 అశ్వ 56-14 వజ్ర 31-8 విష్ట 18-42 రా 15-27 |
| | 30 | గు | కృ. పా 47-11 భర 54-35 సి 31-50 బ 17-50 ది 8-30 |
| | 31 | శు | వి 44-30 కృ 53-27 వ్య 22 27 తై 15-54 ది 23-56 |
| నవంబరు | 1 | శ | త 40-39 రో 51-8 వరి 17-35 వ 12-29 రా 3-0 |
| | 2 | ఆ | చ 35-50 మృ 47-52 వరి 10-0 బ 8-9 ది 4-14 |
| | 3 | సో | పం 30-15 .ఆర్ద్ర 43-54 శి 13-32 కౌ 2-57 ది 7-22 |
| | 4 | మం | ష 24-8 పున 39-27 సా 47-22 వ 24-8 ది 11-34 |
| | 5 | బు | స 17 46 పుష్య 34-49 శు 39-35 బ 17-50. |
| | 6 | గు | అ 11-23 ఆశ్రే 30-15 శుక్ల 31-10 11-23 రా 29-35 |
| | 7 | శు | న 5-16 పిష్యం 54-8 మ 26-6 బ్ర 23-19 గ 5-15 రా 16 19 |
| | 8 | శ | ఏ 54-27 పూఫ 22-32 సి 15-57 బ 26-51 రా 11.7 |
| | 9 | ఆ | ద్వా-ద 50 37 ఉ.ఫ. 19-46 వై 9-11 కౌ 22-28 రా 11-34 |
| | 10 | సో | త్ర. ద 47-40 హ. 18.3 విష్కు 3-19 గ 19-6 రా 9-21 |
| | 11 | మం | చ. ద 46-?0 చి 17-28 ఆయు 54-0 విష్టి 16-52 రా . 3-8 |
| | 12 | బు | అమా 46-5 స్వా 18-5 సౌ 50-48 చతు 16-5 రా 4-3 |

Printed and Published by Dr. S. Seshagiri Rao, at the Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras. Editor: Dr. K. N. Kesari.

# శ్రీ సర్వజిత్ నామ సంll ర ఆశ్వయుజమాసము

| | | | |
|---|---|---|---|
| | 15 | బు | శుద్ధ పా 11-13 స్వా 59-5 విష్కు 38-16 బ 11-13 ది 12-16 త్యా 4-4 శారద నవరాత్ర ప్రారంభం. కలశస్థాపనం. |
| | 16 | గు | వి 10-44 వి శా 60-10 ప్రీ 35-34 కౌ 10-44 ది 13-33 |
| | 17 | శు | త 11-32 విశా 1-31 ఆయు 33-48 గ 11-23 ది 12-4 |
| | 18 | శ | చ 13-29 అనూ 4-46 సౌ 32-53 విష్టి 13-29 ది 19-48 ఉపాంగ లలితా గౌరీవ్రతం. |
| | 19 | ఆ | పం 16-27 జ్యే 9-2 శో 32-41 బా 16-27 రా 1-34 త్యా 4-21 పుస్తక రూపిణీ సరస్వతీపూజ. |
| | 20 | సో | ష 20-14 మూ 14-6 అతి 33-4 తై 20-14 ది 9-45 రా 11-13 |
| | 21 | మం | స 24-35 పూభా 19-43 సు 33-51 వ 24-35 రా 12-35 దేవీత్రిరాత్రవ్రతం, సత్యపరాయణ పుణ్యదినం |
| | 22 | బు | అ 29-16 ఉ.షా 25-39 ధృ 34-49 బ 29.16 రా 7-33 మహాష్టమీ భద్రకాళీ జయంతి,. సత్యపరాక్రమ పుణ్యదినం. |
| | 23 | గు | న 34-9 శ్ర 31-39 శూ 35-46 బా 1-33 రా 13-3 స్వారోచిషమన్వాది: సరస్వత్యుద్వాసనం, దంపత్యాయుధ కాళీపూజా. |
| అక్టోబరు | 24 | శు | ద 37 25 గం 36-3 తై 6-73 రా 17-54 విజయదశమి; అపరాజితా దేవీపూజా, శ్రీదేవ్యుద్వాసనం, దుర్గాదేవ్యుద్వాసనం, రాజ్యలక్ష్మీవ్రతం. శమీపూజా, ద్వాదశవ్రతం. |
| | 25 | శ | ఏ 42-23 శ 42-4 వృ 36-55 వ 10-20 రా 30-55 గోపద్మవ్రతారంభం; పెరియాళ్వారు తిరునక్షత్రం, |
| | 26 | ఆ | ద్వా 45-34 పూ. భా 47-15 ధ్రు 36-4 బ 13-53 |
| | 27 | సో | త్ర. ద 47-47 ఉ.భా 50-49 వ్యా 35-5 కౌ 16-35 ది 12-34 |
| | 28 | మం | చ.ద 48-42 రే 54-19 హర్ష 33-56 గ 18.14 ది 21-59 |
| 1947 వ సంll | 29 | బు | ○ పౌర్ణమి 48-40 అశ్వ 56-14 వజ్ర 31-8 భద్ర 18-42 రా 15-27 |
| | 30 | గు | కృ. పా 47-11 భర 54-35 సి 31-50 బ 17-50 ది 8-30 |
| | 31 | శు | వి 44-30 కృ 53-27 వ్య 22 27 తై 15-54 ది 23-56 |
| | 1 | శ | త 40-39 రో 51-8 వరి 17-35 వ 12-29 రా 3-0 |
| | 2 | ఆ | చ 35-50 మృ 47-52 వరి 10-0 బ 8-9 ది 4-14 |
| | 3 | సో | పం 30-15 ఆర్ద్ర 43-54 శి 13-32 కౌ 2-57 ది 7-22 |
| | 4 | మం | ష 24-8 పున 39-27 సా 47-22 వ 24-8 ది 11-34 |
| నవంబరు | 5 | బు | స 17 46 పుష్య 34-49 శు 39-35 బ 17-50. |
| | 6 | గు | అ 11-23 ఆశ్రే 30-15 శుక్ల 31-10 11-23 రా 29-35 |
| | 7 | శు | న 5-16 ఏమ్యం 54-8 మ 26-6 బ్ర 23-19 గ 5-15 రా 16 19 |
| | 8 | శ | ఏ 51-27 పూఫ 22-32 సి 15-57 బ 26-51 రా 11.7 |
| | 9 | ఆ | ద్వా-ద 50 37 ఉ.ఫ. 19-46 వై 9-11 కౌ 22-28 రా 11-34 |
| | 10 | సో | త్ర. ద 47-40 హ. 18.3 విష్కు 3-19 గ 19-6 రా 9-21 |
| | 11 | మం | చ. ద 46-[illegible]0 చి 17-28 ఆయు 54-0 విష్టి 16-52 రా . 3-8 |
| | 12 | బు | అమా 46-5 స్వా 18-5 సౌ 50-48 చతు 16-5 రా 4-3 |

Printed and Published by Dr. S. Seshagiri Rao, at the Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras. Editor: Dr. K. N. Kesari.